**SUNDARAYYA VIGNANA KENDRAM**
1-8-1/B/25/A, Bagh Lingampalli
Hyderabad – 500 044, Andhra Pradesh, India

## Bibliographic Record Target

Rangiah Chetty, S.
ఋతుచక్రము / S. Rangiah Chetty.- 1st ed.- Madras : S. Ramanujam Chetty, 1915.
15, 80 p. ;20 cm.
Record no. 387

Rangiah Chetty, S.
Ṛtucakramu / S. Rangiah Chetty.- 1st ed.- Madras : S. Ramanujam Chetty, 1915.
15, 80 p. ;20 cm.
Record no. 387

35 mm microfilm
Image placement: IA IIA IB IIB        Date filming began:

With the best compliments of

S. Ramanujam Chetty M.A., B.L.

# Cycle of the Seasons

## ఋతుచక్రము

### PART I


COMPILED BY THE LATE PROFESSOR

S. RANGIAH CHETTY GARU

B. A., F. M. U., F. T. B. C.

*(Telugu Translator to the Government of Madras and Chairman of the Telugu Examiners, University of Madras; Asst. Professor of Mathematics, Madras Christian College).*



FIRST EDITION

PUBLISHED BY

S. RAMANUJAM CHETTY, M.A., B.L.

*Merchant and Honorary Magistrate*

*2/5, Harris Road, Pudupet, Madras.*

**Madras:**

PRINTED BY MESSRS. R. VENKATESHWAR & CO.

AT THE ANANDA PRESS, MADRAS.

**1915.**

# పీఠిక.

శ్రీమదనుపమగుణశోభితు, లఖండశేముషీధను, లపారకృపామతు, లతులాంధ్రభాషాభిమానమాననీయు, లమల సమర్థివంశకలశోదధిపూర్ణశశాంకు, లాశ్రితవత్సలభావ రంగయ్య యగు రంగయ్యశ్రేష్ఠిగారిచే నీ ఋతుచక్రంబను ప్రబంధంబు, అనేక ప్రబంధరత్నపద్య రత్న కల్పితంబు, శ్రీశారదాంబా కంఠముక్తాహారంబు సర్వబుధజన మనోహరంబుగం గూర్పంబడియె. ఇయ్యది ముద్రితంబై పెక్కువత్సరంబులు గడచినను కారణాంతరములచే ప్రకటితంబుగాదయ్యె. చదువరులకు నానారసపాకమాధుర్యంబు చవిజూపుచు గుణంబుల శోభయొదవ, భావగౌరవంబు వొడల కవులడెందముల కానందంబుగల్గించు నీ గ్రంథరాజంబు సర్వజనమాన్యం బగుంగదా.

2. ఋతుచక్రంబునం దిది ప్రథమభాగము. మనకుగల ఆఱుఋతువులలోను వసంతము ప్రతిసంవత్సరమునందును మొదటవచ్చునది యగుటం జేసి యిది ప్రథమమున వర్ణింపంబడినది. రెండవభాగమునందు మఱికొంత వసంతవర్ణనంబును దక్కినఋతువుల వర్ణనంబును బొందుపరుపఁబడును.

3. ఆంగ్లేయ గ్రంథభాండాగారంబులందు నిట్లు సత్కవులప్రబంధంబులందుండి యేర్చి కూర్చినభాగములతో నేర్పరుపఁబడిన గ్రంథములు చాలకలవు. ఆంధ్రభాషయం దిట్టివి యొకటి రెంటికన్న నధికముగలేవు. అల్పకాలంబున ననేకోత్తమ ప్రబంధ పఠన ఫలితంబు గల్గుటం జేసి యిట్టిగ్రంథరాజంబు లధికప్రయోజనకరంబు లనఁ జనును.

PUBLISHER.

# సమర్థి రంగయ్య శ్రేష్ఠిగారు.

ఆంధ్రమహాజనులలో రంగయ శ్రేష్ఠిగారి నెఱుంగనివారు పెక్కండ్రు లేరు. వీరినిగూర్చి ఆంధ్రపత్రిక 1909-వ సం॥ జూలై నెల 14-వ తేది సంచికయందు ఇట్లని వ్రాయఁబడియున్నది :—

"ఎన్నూరువద్ద సంభవించిన కలకత్తా మెయిలుబండి ప్రమాదములో పరమపదవికిఁ జేరినవారిలో సమర్థి రంగయ్యశ్రేష్ఠిగా రొకరని గతసంచికలయందుఁ దెలుపఁబడినది. వీరి దుర్మరణమువలన ఆంధ్రలోకమునకు గొప్పనష్టము సంభవించిన దనుటకు సందియములేదు. చెన్నపురిలో మిల్లరుకాలేజియని పిలువఁబడు క్రైస్తవ కళాశాలలో విద్యనభ్యసించిన ప్రతివిద్యార్థియు నీయనఘోరమరణమునకయి దుఃఖించకపోడు. శ్రేష్ఠిగారు వైశ్యకుల భూషణులు. చెన్నపురి పచ్చయప్ప విద్యాలయమునందు ప్రవేశించి ప్రవేశపరీక్షవరకు జదివి ఆ పరీక్షయందు 1865-వ సం॥ నందు జయమొందినవారిలో ప్రప్రథములుగ నిలిచిరి. రెండు సంవత్సరములు తరువాత శ్రేష్ఠిగారు ప్రథమశాస్త్రి పరీక్షయందుఁగూడ మొదటి తరగతిలోఁ గృతార్థులై, పట్టపరీక్షకుఁ జదువుటకుఁ జెన్నపురి ప్రెసిడెన్సీ కళాశాలలోఁ బ్రవేశించిరి. ఈయన యద్భుత మేధాసంపన్నతను గనిపెట్టి డాక్టరు మిల్లరుగారు తమవిద్యాలయమునందు గణితశాస్త్రోపాధ్యాయుఁడుగను, ఆంధ్రభాషాభ్యసనప్రవర్తకుఁడుగను నియమించిరి. ఈ పదవిలో ముప్పదియయిదు సంవత్సరములుండి, విద్యార్థిలోకముయొక్క మన్నలను బడసినదేగాక, సహోపాధ్యాయులయొక్క గౌరవమునకుఁగూడ పాత్రులైరి. వీరి విద్యా

పాండిత్యములు చెన్నపురి విశ్వవిద్యాలయాధికారులకుఁ దేట తెల్లము గ వెల్లడియగుటంజేసి గణితశాస్త్రి పరీక్షాధికారిగ నియమించుట యేగాక, ఆంధ్రభాషపరీక్షాధికారసభాధ్యక్షుఁడుగ (Chairman of the Telugu Board of Examiners) నేర్పఱచిరి. శ్రేష్ఠిగారు ఆంగ్లేయభాషలో బీ. ఏ. పరీక్షయందుఁ దేరి గణిత శాస్త్రిమునందు గొప్ప పాండిత్యమును సంపాదించిరి. తెలుగు భాషయం దీయనకుఁ గల పాండిత్యము నిరుపమానము. ఈ కాలములో ఇంగ్లీషు చదువగనే స్వభాషయం దనురాగములేక మఱచిపోవు విద్యార్థులను నీయన చరిత్రము సిగ్గును పొందునట్లు చేయుచున్నది. క్రైస్తవకళాశాలలో యుద్యోగమును మానుకొని యుపకార వేతనమును బుచ్చుకొనిన * పిదప శ్రేష్ఠిగారు చెన్నపురి దొరతనము వారివలన ఆంధ్రభాషాంతరీకరణకర్త (తెలుగు ట్రాన్సులేటరు) గ నేమింపఁబడిరి. తెలుఁగుభాషలోఁ బ్రచురితమగు వార్తాపత్రికలను, గ్రంథములను, జదివి తత్సారాంశమును ప్రభుత్వమువారి కెఱుకపఱచుట నీ యుద్యోగియొక్క కర్తవ్యము. ఈ కార్యభారమును పదునేను వత్సరములనుండి వీరు నిర్విఘ్నముగ నిర్వర్తించుటయేగాక ఆంధ్రపత్రికాధిపతులకు ననేక సమయములందు నెట్టిమహోపకారమును జేసినది తత్పత్రికాధిపతులేయెఱుఁగుదురు. వీరు వ్రాసిన 'కాలచక్ర' మను గ్రంథము శాస్త్రోపాధ్యాయ పరీక్షకుఁ బఠనీయ గ్రంథముగ నిర్ణయింపఁబడినది. శ్రేష్ఠిగారికి కిరుపురు పుత్రులును, నొక్క పుత్రికయు, పౌత్రులును, పౌత్రికలును గలరు. వీరిలో నగ్రజుఁడు యం. ఏ., బి. యల్ పరీక్షయందు గృతార్థుఁడై విద్యావంతుఁడనఁ బ్రసిద్ధిగాంచి, చెన్నపురి యున్నతన్యాయ విచారణ స్థానమందు న్యాయవాదిగానున్న శ్రీరామానుజము శ్రేష్ఠిగారు. వీ రనుగ్రహించి తమ జనకుని ఛాయాప్రతిమను మాకొసంగి మమ్మాదరించుటవల్లననే రంగయ్య శ్రేష్ఠిగారి ఛాయాప్రతిమ ముద్రణచేయించి వారి స్వరూపము నిచ్చుట ముద్రించితిమి. ఇచ్చుట శ్రేష్ఠిగారు విశ్వవిద్యాలయ పరీక్షాధికారి యుడుపులను ధరించియున్నారు.

* "పుచ్చుకొనినపిదప" యనుటకుబదులు "పుచ్చుకొనుటకుఁ బూర్వమె" యని యుండవలెను.



ఈయన ఆంధ్రభాషాభివృద్ధికై చేసిన మహోపకారమునకు ప్రతి ఆంధ్రుఁడును కృతజ్ఞుఁడై యుండవలయుననుట నిర్వివాదాంశము. ఆంధ్రజాతీయసంఘ సంస్కరణమునకు నీయన నిరంతరము పాటుపడెను.

ఈయనఁగూర్చి కవులు వ్రాసినపద్యములఁ గొన్నింటి నీ క్రిందఁ బొందుపరిచితిమి,

శా॥ "శ్రీమద్దివ్యనిజాంఘ్రిపద్మములు సంసేవించుచుఁ భక్తిచే
ధీమంతుండగు నాంజనేయుని నసద్దేహేంద్రియాతీతచి
ద్భూమానందుఁడ వీవనేనని కృపన్బోధించు శ్రీజానకీ
రామ బ్రహ్మము" రక్షయైమనుచు మారంగాఖ్యధీమాన్యునిన్.

క॥ శ్రీకరసద్గుణ విభవా,
ప్రాకట విద్యాప్రభావ, ప్రవిమలభావా,
లోకనుతసుస్వభావా,
రాకేందు యశఃప్రకాశ రంగయదేవా! ౧॥

సీ. పురుషోత్తముండని నరవరుల్ ప్రకటింపఁ,
జతురాననుండని చతురు లెంచ,
శంకరుం డితఁడని సర్వజ్ఞు లెదనెంచ
శ్రీనివాసుండని శిష్టులనఁగ,
వివులవాణీరమాకమనీయుఁ డనకవుల్,
సర్వమంగళశుభాస్పదుఁడన బుధు,
లాశ్రిత వత్సలుం డని వరదుండని,
కరుణాశరధి యని ధరనుగల్గు

తే. గీ. సర్వసుజనులు పొగడంగ, సకలదిశల
భవదమలకీర్తిచంద్రికల్ పర్వ నిత్య
పూర్ణిమాభావమున బ్రహ్మ పొందినట్టి
నింద దీరె సమర్థివార్నిధి శశాంక॥ ౨॥

సీ. సౌభాగ్యమున కింద్రు సరిచెప్ప నెంతుమా
నీచవర్తన నింద మోచె నతఁడు. ।
గాంభీర్యమున సాటి యంభోధి యంటిమా
కుంభజుం డరచేతఁగూర్చి త్రావె;
నౌన్నత్యమున వింధ్య మాఁడు యంటిమా
యాయగస్త్యుఁడు క్రుంగ నణిచె దాని ;
శేముషిం దుల యంచు శేషు భావింతుమా
వక్రగాముల ప్రభుత్వంబు వడసె।

తే. గీ. నతఁడు ; నీకె నెందు మీగుణనుతులు సేయ
నుపమ లొాదవని యరయుచు నున్న వారు
స్వర్గభూవర్గలం దెల్ల సాటి మీకు
మీరె యనుమాట మరచియు నూరు లెల్ల॥ ౩॥

సీ. హస్తీంద్రములు భూమియడుగు మూలల డాగె,
హస్తీంద్రుఁ డొక సంద్ర మందుఁ జేరె.
కూర్మరాజం బొండు కొండయండను తాఁటె,
వనమందుఁ జొచ్చె నవ్వరవరాహ,
మమరాగములజంగమములై జడములయ్యె,
జలదంబు లడలుచు జలధిఁజేరె,
ముక్కులై చెక్కులై స్రుక్కెఁ జుక్కలతేఁడు,
కడఁగి వేల్పులగిడ్డి గడ్డిగఱచె,



తే. గీ. భవదమేయధురంధరత్వంబుతోడి
సాటిగనలేక, భవదీయ శశ్వదమల
దానదాతృత్వములపెంపు దమ కొకింత
గలిగియుంటకు, వెతఁజెంది కలతనొంది॥ ౪॥

సీ. శ్రీశోభితులు మీరు శ్రీశోభితుఁడు హరి,
భేద మావంతయు లేదు మీకు,
పురుషోత్తములు మీరు పురుషోత్తముఁ డతండు,
ద్వైతభావము లేదు తలఁప మీకు।
కంజాక్షులరు మీరు కంజాక్షుఁ డాతండు,
నేక భావం బెందు నెసఁగు మీకు।
బుధపాలకులు మీరు బుధపాలకుఁ డతండు,
సారూప్య మొప్పారు జగతి మీకు,

తే. గీ. తజ్జ్ఞులరు మీర లతఁడును తజ్జ్ఞుఁ డరయ,
కువలయామోదదాయకు ల్గుణనిధాను,
లౌదు రీరలు కువలయామోదదాయి,
గుణనిధానం బె యగుఁ గనుఁగొనఁగ నతఁడు॥ ౫॥

కం. యుగయుగమును ప్రత్యక్షం
బుగ సుజనుల నాదరించి పోషించితి నీ
యుగమున నట్లుండమి తగ
వగునే యని యాసమర్థి యన్వయ మందుర్॥ ౬॥

కం. కరుణావార్నిధి లక్ష్మీ
వరుఁడే రంగయ యనఁగ నవతరించెను, శ్రీ
హరిగాక యున్న నింతటి
వరవిబుధావనవిలాసవైఖరి యున్నే॥ ౭॥

కం. అని సుకవు లనుదినంబును
వినుతింపఁగ నాశ్రితులగు విబుధావళి నం
దునినందను చందంబున
ననవరతముఁ బ్రోచు మిమ్ము నలవియె పొగడన్ ॥ ౭॥

లయగ్రాహి. చందురునియందమును, కుందములచందమును,
నిందుధరు పొందికను, చందనవికాసం,
బైందవి మనోహరత, వందితసితాబ్జకళ,
సుందరసురాగరమ, చిందముల పొల్పున్ ।
బొంది, రజతాద్రి, నరవిందభవుసోదరి న
మందగతిఁ జిల్వదొరచందమును జూడన్ ।
ముందుగను పాల్కడలి యందమును గాంచఁ జని
యందెపుడు మీయశము విందులఁ జెలంగున్ ॥ ౮॥

కం. శరసంఖ్యాబ్దము లతిసుఖ
పరంపరలు మీదయావిభవము గలుగుటన్
నిరత మనుభవించితి భువి
సురతరుశాఖను వసించు శుకముచెలువునన్॥

తే. గీ. చంద్రునకు నూలుపోగన్న చందమునను
మత్కృతజ్ఞతా సూచకమత్కృతనవ
రత్నములఁ గూర్చి భక్తి పురస్సరముగ
నర్పణ మొనర్చితిని బ్రీతి ననఘచరిత॥

తే. గీ. అల్పచీక్రోడ మొనరించు నల్పకృతియె।
ప్రేమఁ బురికొల్పఁ జేసె శ్రీరామచంద్రు
హృదయసీమను; కావున నిదియ మీర।
లధిక వాత్సల్యమునఁ గొను టబ్రమగునె॥



కం. కనకపురిపార్థసారథి
యమ యనుపమసుగుణధనున కాత్మజుఁడను, శ్రీ
హనుమత్పదసేవకుఁడ, న
వనిభాస్కరుఁ డనెడి పేరఁ బరగెడివాడన్.

క. భాస్కరరావు.

ఉ. శ్రీకరమౌ సమర్థికులసింధుసుధాకర! మీయశఃప్రభా
నీకముతోసరిన్గనక నేను వియచ్చరితుండ, దానె? భూ
లోకనివాసి, నవ్వరాకొ లోకులు? అంచుఁగృశించి యర్ధుడై
ప్రాకెడుకృష్ణపక్షశశి, పండితవర్య! యిదేమిచిత్రమో!

కం. (ద్వర్థి) చల్లనిమానసయుతుడై ।
యెల్లద్విజవ్రజముపొగడ హెచ్చినవాడై ।
నల్లలితపక్షపాతిగఁ ।
జెల్లెడినృపహంసతుల్యశీలుఁడు మీరల్ ॥

చ. "వరసుగుణా! సమృద్ధకులవార్నిధి చంద్రమ! పద్మినీడ్యభా
సురచిరవిగ్రహస్ఫురణశోభిలి సత్ప్రథవర్తియై ధరా
ధరశిరభూషపాదుడయి ధాత్రిని మిత్రుఁడుగాఁ దనర్చు భా
స్కరునకు మీకు భేద మికఁ గానముగా వినఁగా కవీశ్వరా!

మచ్చసూర్యారావు.

కం. శ్రీయుతబుధహితమహితా
స్వీయాకలుష ప్రభాతి శేషమనీషా
శ్రేయోధికతయునిగమో
క్త్యాయుష్యంబొప్పరంగ యార్యసుచర్యా.

కం. రాజాధిరాజవందిత, సౌజన్యనిధీ కవీంద్రసన్నుతచరితా,
భూజననిర్జరభూజా, రాజీవదళాక్షదక్ష, రంగయశ్రేష్ఠీ॥

గీ. తమయశంబున దిశలెల్ల నమలములయి,
వన్నె వారినవిషయంబుగన్నవాఁడ,
గోరి దర్శించి దయచూఱఁగొన్నవాడ,
శెట్టివాఁడనె మిము వీక్షవినుము ప్రోడ.

నాదెళ్ల పురుషోత్తముఁడు.

ఉ. తాముదయాళురంచు వరధర్మపరాయణు లంచు నాశ్రిత।
స్తోమహితార్థసంఘటన తోషకులంచుఁ బ్రశాంతులంచు ను
ద్దామరసజ్ఞులంచును వదాన్యులటంచు భవద్యశోలస
న్నామసుకీర్తవల్లివి గనన్వలె నంచును గోర్కెపుట్టదే॥

క॥ శ్రీకరుఁడై దిగ్విజయ।
శ్రీకరుఁడై సర్వదావశీకరుఁడై ల।
క్ష్మీకరుఁడై శ్రీహరి రిపు।
భీకరుఁడై మిమ్ముఁ బ్రోచుఁ బ్రియకరుఁ డగుచున్ ॥

ఖండవిల్లి రామచంద్రుడు.

ఉ. "రంగ!" యటంచు భక్తిగమరంగ యదూద్వహు రంగభర్తఁజీ
రంగ, యశంబురన్ హారతురంగయమిత్రవజసింహరాజిఁగే
రంగ యమాత్మజాతు నెమరంగ యథార్థత, శ్రీసమర్థిమా
రంగయసెట్టిగారి కమరంగ యదృచ్ఛఁ గవుల్నుతింపరే?

సెట్టి లక్ష్మీనరసింహము.

శ్లో. సౌమ్యోబ్దోఽభూదసౌమ్య శ్శుచిరశుచిరభూ చ్ఛుద్ధపక్షోఽ
ప్యశుద్ధః,
మందో వారస్స్వయం భద్రతిథిరపిచహా కింత్వభద్రాద్వితీయా
సంధూనాం ధార్మికాణాం విబుధపరిషదాం శ్రుణ్వతాం మా
నవానాం,
రంగయ్యశ్రేష్ఠివర్యే రఘుపతిచరణం రామరామేతియాతే.



శ్లో. సమర్థికులశేఖర స్సకలసద్గుణా లంకృతః,
సమర్థిజనపోషక స్సదయసౌమ్యవాగ్భూషణః,
సమస్తజనరంజక స్సదసదర్థవిజ్ఞ స్సుధీః,
సతాంసురతరూపమ స్సకిలహంత నాకంగతః.

శ్లో. పునర్వసూతారక చంద్రయోగే,
పుమానయం పుణ్యకృతీసమర్థః.
దివంగతస్తారక రామనామ,
స్మరణహీనై వాస్యపునర్భవత్వమ్.

సిద్ధాంతి - శివశంకర శాస్త్రి.

గీ. భాగ్య భోగ్యములకు నాలవాల మరయ,
సిరికి స్థానంబు, లక్ష్మికి నిరవుపట్టు,
పరగనైశ్వర్యమునకును బట్టుకొమ్మ,
వైశ్యసత్కులమయ్య నీవసుధయంను.

గీ. సత్యమార్గాను చరులగుసత్కళాని
ధులు, కువలయమునకు నార్తి దొరలనీని
మిత్రులరు, పుణ్యజనుల సమితినేర్చ
కున్నపురుషోత్తములుమీరు కులమునందు.

సీ. జంగారికుంభిరాడ్దంభోళి దంభోళి
ధరతురంగే భభిద్దరపటీర,
పారదశారదాశారద నారద
నారద కాశసూన ఘనసార,
సారకుందేందు పాషాణ చందన చంద్ర
కలశవారాశ్శి శ్రీకల్పభూజ,
హారనీహార కంఠీరవామరఝరీ
సన్నిభంబైన నీసరసయశము,

రాజీవజాండ కరండరాజమునకుఁ
గర్పూరశకలమై గ్రాగుచుండ,
రూఢిదిక్కాసరసలోచనాకుచతటీ
సితపటాంచల శోభఁజేయుచుండఁ.

గీ. దనరితౌమేల్భళీయనిధరణిమెచ్చ
దీపితసమర్థులపమోధిలలితాబ్జ
వైభవాడంబర విచిత్ర వరచరిత్ర
శేముషీధుర్య రంగయ శ్రేష్టివర్య.

గీ. అఖిల నిష్ఠురకార్యక్రియా నిపుణత
బహుసమర్థతగల్గుటఁ బట్టిసార్థ
కంబుగాఁ జెల్లె మీపేరు గణుతిమీర
శ్రేష్ఠగుణధుర్య రంగయశ్రేష్ఠివర్య.

ఉ. తిరమైభూచక్రమందున్ తిలకముగతిఁదోఁచెంచుమద్రాసువీటన్,
పరగన్ బ్రజ్ఞాగ్రధుర్యుల్ పరిపరిగతులన్ బ్రస్తుతుల్ సేయ వాసం,
బురహిన్ గావించి మోదంబును గను గుణధీపూర్ణునిన్ రంగయాఖ్యున్
నిరతంబున్ బ్రోచుగాతన్ నిరుపమకరుణన్ నిర్మలున్ దైవమెందున్,

క. సాంబసివరావు.

ఉ. సారస తారహార దర శారద శారద తార తారమం,
దార తుషార శారశర నారద పారద మారహారవి,
స్ఫార శతార తారధర శారద నారద సారసారస,
క్షీరపటీరహీరభరకీర్తి, స॥ రంగయపండితాగ్రణీ,



సీ. రాజ రాజనరేంద్ర రక్షితకవిరాజి
తాస్థాన సీమల నతిశయిల్లి,
సర్వజ్ఞసింగమక్ష్మాపాల పాలిత
శ్రీనాథముఖుల చేఁజెన్ను మీఱి,
పెద్దనప్రముఖ శోభిత కృష్ణరాయధీ
ప్రౌఢిమ స్ఫూర్తిచేఁ బరిఢవిల్లి,
నవనీతసంకాశ నవయశోన్వితజగ
ద్ధిత కవిరాజిచేఁ దేజరిల్లి,

తే-గీ॥ యాంధ్రభాషావిలాసినిహాసు మీఱి,
యిపుడు నినుఁ దండ్రిఁగామది నెంచి మించి,
చెంగలించి నీభుజవీటిఁ జేరె నౌర!,
సారగాంభీర్య రంగయధీరవర్య.

హట్టి. కృష్ణమూర్తిరావు.

సీ. సకలాంధ్రపండిత శాఖిసంవర్ధన
కారణ జీవన పూరమనగ,
ఆంధ్రోక్తివల్లికా గ్రాభాతసుందర
సుమగుళుచ్ఛాఖండశోభ యనగ,
బహుకావ్యమయదుగ్ధపటునిర్మథనలబ్ధ
సంశుద్ధనవనీత సారమనగ,
సర్వాంధ్రకవికృతి స్వర్ణగుణాగుణ
సంశోధనకషపాషాణమనఁగ.

తే-గీ॥ వెలయునెవ్వని పాండిత్యవిలసనంబు,
పరమపుణ్యంపు చెయ్యులపసదనంబు,

కవిసితెలియంగఁ గలవారిఘనధనంబు,
అట్టిముదితార్య రంగయ చెట్టివర్యా.

సీ. బహుతరాశలతోడఁ బారిచేరఁగవచ్చు
పండితజనముల పట్టుగొమ్మ
విద్యాధికృతజన వేద్యాంధ్రసంబంధ
కార్యపద్ధతిఁజూపు గాఢదీప్తి
విద్యాపయఃపాసవిస్తరితామోద
బాలకావళిపాలిపాలవెల్లి
స్వాజ్ఞానుబద్ధ మహాంధ్రపాఠకజన
రచితోక్తి మణులకు రత్నశాణ.

తే-గీ॥ మనుచునెవ్వనిగాంచు విద్యాతిశయులు,
తలచుచునువేయి నోళ్లను పొలుపుమీరఁ,
జెప్పికొనుచుందు రట్టిసీ చెలిమి యనెడు,
సిరులుఁజెందింపు రంగయచెట్టిమిన్న.

**సింహావలోకనము**

మ. రమణీగింటివెభారతీ గురుకృపా ప్రాప్తోరు విద్యాపరి
శ్రమహాణప్రభుదత్తవార్షిక పరీక్షగ్రంథనిర్మాణరూ
పమహాసాంద్రయశశ్శరత్నమయవి భ్రాజత్పూర్ణచంద్రాతప
క్రమితాకాశధరాదిగంతరుని శ్రీరంగయ్యశెట్టిఁ ఘనుఁ
రమణీగంటివె.



ఉభయముత్రోముఖ నామగోపన బంధము.

| | | | | |
|---|---|---|---|---|
| శ్రీ | శ్రీ | మనోహరాశ్రిత జనమందారధారుణీ చక్రసంత్రాణస | ద | య |
| శ్రీ | రం | గనాయకీసేవితపదపద్మ, యింద్రాదివినుత, భోగీంద్రశ | య | న |
| జ | గ | దధిష్ఠితచరాచరభూతసంఘాత ఘనపాపముల బ్రోచికావ | ను | జ్జ |
| ఆ | య | తస్థైర్యధైర్యా టోపగాంభీర్య భూరిమహామేరుభూధర | స | మ |
| చే | సె | క్షికృత్యంబుచే సోమకాసురసంహరణార్జిత సకల ని | గ | మ |
| ప | ట్టి | శత్రుసమూహభంజన సజ్జనాచరిత సమర్పితసర్వస | వ | న |
| నా | గా | యుతబలాఢ్యనాగేంద్రపర్యంక గుకుతఁవిభవవైకుంఠని | ల | య |
| గ | రు | డవాహన,నిత్యకల్యాణగుణగణ, పాపమోచనశ్రీపదపద్మ | యు | గ్మ |

గీ. వసుచరణాది రెండవ వర్ణకలిత
పురుషునకు నాయురైశ్వర్య పుత్రులనిడి
బ్రోచికరుణించి చరణాంత పూర్వవర్ణ
విదితవాంచ నొసంగ గావింపుమీశ ॥

శా. శ్రీమద్వాగ్గలనాథవుండుదివిజజ్యేష్ఠుండుసద్యోయశః
కాముఁ రంగయశెట్టినిఁ విబుధసత్కల్పద్రుమప్రాయునిఁ
బ్రేమఁబుత్రుల నాయురర్థముల నుర్విన్సర్వకామ్యంబులు
ద్దామప్రక్రియ నిచ్చి బ్రోవుత శుభోధంచత్కృపాపూర్ణుడై.

మ. వరలక్ష్మీకుచకుంకుమాగరుల సద్వక్షుండు సర్వేశుడా
హరిశ్రీరంగయశెట్టినిఁ సకలవిద్యాప్రౌఢిమోపేతునిఁ
శరదిందూద్భవచంద్రికామలయశస్సాంద్రుఁ గుణోధృతునిఁ
సిరులఁబుత్రులనిచ్చిసంతతము రక్షించుఁ గృపాయుక్తుడై.

శా. శ్రీభూభృత్తనయాపదాబ్జ ఘనకాశ్మీరోరుపత్రావళీ
శోభాంచద్ఘనవక్షుడింపువిలస జ్జూటుండుసంపూర్ణచం
ద్రాభుఁ రంగయశెట్టినిఁ సకలసామ్రాజ్యాధికారాదిక
ప్రాభావోన్నతిజెందివర్ధిలగ సంరక్షించుగాతఁ గృపన్.

శా॥ శ్రీలక్ష్మీ మెలనాఁగ శౌరిపదనీరేజాత సేనామహా
త్వాలబ్ధాయత వైభవోల్లసితు లోకానందకార్యక్రియా
లోలున్ రంగయ శెట్టినిన్ సుకవిసుశ్లోకావళీపాలకున్
శ్రీలన్ బుత్రుల నిచ్చి బ్రోవుత కృపార్ద్రీభూతహృత్పద్మయై.

చల్లా - వెంకటరామయ్య.

ఉ. శ్రీయుతశ్రీసమర్థికుల సింధుసుధాకర రంగయార్యవి
ద్యాయుత సర్వసద్గుణవిహార కృపాకర శత్రు భీకరా
ధీయుతసత్కవిత్వజల ధీ, సుగభీరపరోపకారయీ
నాయనిశంభు లింగమను నామనవిన్ విని యాదరింపుమా.

శా. శ్రీరమణీమనోహరుని చిత్తమునన్ స్మరియించుచున్ యశ
స్సారసముత్కరా పరమ సాత్త్విక లోకసరోజభాస్కరా।
మేమసమానధీర మిము మేమరభక్తి నుతింతు నీయలం
కారసుధాకరోదయము కావ్యము గైకొని గారవింపుమా.

నాయుని శంభులింగం.

చం. అమలుని, పక్షపాతము పరాసహనంబును స్వప్రయోజక
త్వము, నను, దుర్గుణంబులను దగ్గరఁ జేరఁగనీక, యెల్లకా
లము మనయాంధ్రభాషకుఁ గళల్ గడువృద్ధి యొనర్చు రంగయా
ఖ్యుమనుచుఁ గాతఁ గేశవుఁడు గూర్మిననాయువమిచ్చుచున్ గృపన్

మ. తనకుం బ్రాభవ మొండు గల్గినను నేతన్మాత్ర మెవ్వానికై
నను నేకీడును గాకయుండ నతిమాన్యప్రక్రియన్ గార్యసా
ధనమున్ జేసెడి రంగసెట్టి కిడు గాతన్ బుండరీకాక్షుఁడి
ష్టమునదీర్ఘాయువనామయంబు విభవంబున్ దేహదార్ఢ్యంబునున్,



మ. ప్రచురింపం బడుచుండునట్టి మనయాంధ్రగ్రంథముల్ చూచి, త
ద్రచనల్ చేసిన సత్కవీంద్రులకు నుత్సాహంబు సంధింప, శ్రే
ష్ఠచిరాసక్తిని, యూనివర్సిటికిఁ బాఠ్యగ్రంథముల్ చేసిత
ద్రచనల్, పొల్చెడిరంగయ్యసెట్టికిడుగాతన్ విష్ణుఁడారోగ్యమున్

భమిడిపల్లి - సీతారామశర్మ.

1. శ్రీరమణీధవాంఘ్రి సరసీరుహసేవిత భృంగవర్యునిన్,
భూరిసమస్తసంపదలచేఁ బొగడొందెడు వైశ్యవర్యునిన్,
సారమతిన్ తెలుంగు నెగి చక్కఁగ నేర్చిన పండితోత్తమున్
మారుని తండ్రి బ్రోచెడిని మాన్యుని రంగయశ్రేష్ఠిసజ్జనున్.

2. వెన్నునిముద్దుబిడ్డ మదివేడుక సేయుట మాని వాణిపే,
రెన్నికఁ గన్నరాజనృపు నింటను బుట్టుకఁ జెంది, నెల్లురన్,
తిన్నగమమ్మసిద్ధి సభఁ దేటగుమాటల నేర్చి; కృష్ణునిన్,
పన్నగఁ జేతఁ బట్టె; ముదిపాయమునం దుదిఁ జేరె రంగనిన్.

3. శ్రీసుకవీంద్రసూరితతి చేరఁగఁ జేరి తదీయ శాస్త్రముల్,
వాసిగ నేర్చు; నేర్చి తనవారికి నేర్పఁడఁ జెప్పు; చెప్పి శ్రీ,
భూసురవాక్ప్రసంగమును ముచ్చటఁ గ్రోలును; గ్రోలి మెచ్చుచున్
భూసురకీర్తిచే వెలుఁగు ప్రాజ్ఞుఁడు రంగయశ్రేష్ఠి నెమ్మదిన్.

4. వినయసుగుణశీలా, విశ్రుతశ్రీలలోలా,
జనవినుతసు విద్యా, సత్కవిస్వాంతహృద్యా,
మనసిజపితభక్తా, మాన్యసత్ప్రీతియుక్తా,
ప్రణుతవిమలకీర్తీ, రంగయ్యశ్రేష్ఠినామా.

శి. వేంకటరంగము.

To

M. R. Ry.

## S. Rungiah Chettiar Garu, B. A.,

This Acrostic is most respectfully dedicated by his ever grateful child P. GABRIEL PILLAI.

---

S o mayst thou live, oh ! noble sire on earth,
R emembered long by those in thee that found
U nbroken shelter ; thine e'er generous heart
N ay more, paternal love extended thus
G ifts far more precions than their worth ; e'er prompt
I n doing good, dispersing clouds of need
A n honor thou hast gained and thus a home
H igh far in Heaven thy future dwelling place,
C ommuning with the Omnipotent God.
H igh soars they name for charity well known
E' en higher far than that great Karna's, name
T he little mercy thou hast shown to me,
T hat little I, in all the world can't find.
I n thee I see my father, mother and all
A nd more my God on earth ; may God thee bless !
R ight long shalt thou live here to do more good !

Printed by Messrs. THOMPSON & Co.,
Under the Directions of
Mr. S. RAMANUJAM CHETTY, M.A., B.L.,
Hon. Magistrate,
2/5 Harris Road, Pudupet, MADRAS.

# ఋతుచక్రము.

క. శ్రీరుచిరమహిమసీమా
ధీరజనధ్యేయదివ్య • తేజోభూమా
భూరికరుణాభిరామా
కూరిమి మముఁ బ్రోవుమా మ • హాగుణధామా.

వ. నవరసమపురుషప్రార్థనంబు సేసి వివిధవిద్యావిలాసభాసురు లగువిద్వదగ్రేసరుల కానందజనకంబుగ ఋతుచక్రం బను పేర వసంతాదులవర్ణనంబు బహుళకవికృత కావ్యాదులయందుండి గ్రహించి సంఘటించెద.

## ప్రథమారము, వసంతవర్ణనము.

క. అంకురపల్లవపత్త్రిచ
యాంకితముకుళప్రసూన • హారిఫలములం
బొంకము లగువనములు ని
ర్వంకముగ నుతింపఁబడు వ • సంతమునందుఁ. (కావ్యాలంకారచూడామణి.) 1

---

వివిధవిద్యలు—వేదాదు లగుపలువిద్యలు:—అఙ్గాని వేదా శ్చత్వారో, మీమాంసా న్యాయవిస్తరః, పురాణం ధర్మశాస్త్రంచ, విద్యా హ్యేతా శ్చతుర్దశ, ఆయుర్వేదో ధనుర్వేదో, గాన్ధర్వ శ్చేతి తే త్రయః, అర్థశాస్త్రం చతుర్థంతు, విద్యాహ్యష్టాదశైవతు.
కావ్యము—రసాత్మక మగువాక్యము, దోషములు దాని కపకర్షకములు, గుణాలంకారరీతు లుత్కర్ష హేతువులు.

## * భారతము, ఆదిపర్వము, ఆశ్వాసము ౫.

(పాండురాజు శతశృంగపర్వతంబున నేవురుపుత్త్రులం బడసి యున్న నాత ని
పాలికి వసుదేవుపురోహితుండు గశ్యపుఁ డనం బరఁగువాఁ డరుగుదెం చి
వసుదేవుసందేశంబుఁ జెప్పి తత్కుమారులకుం గ్రమంబునఁ జౌలోపన యు
నంబు లొనరించి వేదాధ్యయనంబు సేయించుచున్నంత వసంతసమయం బు
చనుదెంచుచున్న.)

ఉ. గ్రా. కమ్మనిలతాంతముల ♦ కు మ్మొనసి వచ్చు మధు ♦ పమ్ములసుగీతనిన ♦ దమ్ము లెఁ ...
తమ్ములలసత్కిసల ♦ యమ్ముల సుగంధిముకు ♦ ళమ్ములను నానుచు ము ♦ ద వై ...
లమ్ము లగుకోకిలకు ♦ లమ్ములరవమ్ము మధు ♦ ర మ్మగుచు వీచె నని ♦ శమ్ము ...
రమ్మున నశోకనిక ♦ రమ్ములును జంపకచ ♦ యమ్ములును గింశుకవ ♦ నమ్ములు ...
ఉ. గ్రా. చందనతమాలతరు ♦ లందు నగురుద్రుమము ♦ లందుఁ గదళీవనము ♦ లం ... నరాజీ
కందతరుషండముల ♦ యందును విలోలదర ♦ విందసరసీవనము ♦ లందు వ ...
కందళితపుష్పమక ♦ రందరసముం దగులు ♦ చుం దనువు సౌరభము ♦ నొం... ద జ...
నందముగఁ బ్రోషితుల ♦ డెందము లలందురఁగ ♦ మందమలయానిల మ ♦ మంద... గతి వీ...

---

## † కావ్యాలంకారచూడామణి, ఉల్లాసము 3.

(కావ్యం ... ష్టాదశవర్ణాన్వితంబై వెలుంగు ... ఋతువర్ణనంబున.)

మ. సగ... ... డు లయ్యె గుణవి ♦ స్ఫారంబు ఘోరంబుగా
... ణంబులు వా... 
నెరసెం గిరము లంగజ ... తబిరుదా ♦ నీకంబుఁ గీర్తించె మిం

---

* భారతము నాంధ్రీక ... రింప నారంభించినవాఁడు నన్నయభట్టారకుఁడు. ఇతఁడేకా దశశతాబ్దమధ్యమున నుండినవాఁ ... డు. ఈకవి యాంధ్రశబ్దచింతామణి యనువ్యాకరణము రచియించి వాగనుశాసనుఁ డని ప్రసిద్ధి గాంచె. మఱియు నింద్రవిజయ మనుకావ్య మొక్కటియు లక్షణసారం బనుఛందోగ్రంథ ... మొక్కటియు నితనిచే వ్రాయఁబడియె. ఇవి దొరకవు. అయినను నివి రంగరాట్ఛందములో న ... దాహరింపఁ బడియున్నవి.

2. లతాంతములకుఁ + మొనసి = లతాంతములకుమ్మొనసి – ఇచట ద్రుతంబునకు మకారాదేశము విశేషంబు.

† కావ్యాలంకారచూడామణి, రా ... జమహేంద్రపురాధీశ్వరుఁడును జళుక్యవం



చె రసాలాగ్రములు పల్లవార్చులు తలి ♦ ర్చె న్విశ్వనాథావనీ
వరుతో నల్గుట చెల్లునే యనతఁడై ♦ వామాక్షి కీపట్టునన్. 4

---

## * నృసింహపురాణము, ఆశ్వాసము ౨.

(హిరణ్యకశిపుండు తపం బొనర్చుచుండ నాతనినియతికిఁ బ్రత్యూహంబు
గావి నూహించి సంక్రందనుండు రంభాప్రముఖాప్సరస్సరోజముఖుల
నిరూ ంచుడు నయ్యిందువదన లందఱుఁ గంధమాదనముం జొచ్చి రంత.)

వారలతో నె యాత్మ
స్ఫారవిః ఉల్లఁ గొని వ ♦ సంతుఁడు దనయా
కారంబు ...పె నక్కాం
రంబు ...రసమయ ♦ దర్పాపహుఁ డై. 5

... ద ... ంచెఁ జైత్రుఁ డని ♦ యెల్లవనంబులకుం బ్రమోదముల్
పొదలఁగ మేలివార్తఁ గొని ♦ బోరన వచ్చినదాడికాఁ డన
న్మృదువనదేవతాముఖస ♦ మీర మెదుర్కొన నుల్లసిల్లె నిం
పొదవఁగ దక్షిణానిల మ ♦ నూనమనోహరఖేలనంబులన్. 6

...డినయాకు డుల్ల నవ ♦ పల్లవముల్ తిలకింపఁ బూఁబొదల్
...డఁగఁ బర్వ లేఁగొనలు ♦ నిద్దము లై నిగుడంగ మ్రాఁకు లొం

---

...భవుఁడును నైన విశ్వేశ్వరమహారాజున కంకితము చేయఁబడెను. ఈరాజు హూణ ...ు 1330 సంవత్సరముదాఁక నుండినట్లు తోఁచెడును. కావున నీగ్రంథమును రచించిన ...ోట పెద్దన పదునాలవశతాబ్దము మొదటిసగమునం దున్నవాఁ డనవచ్చును. ఈగ్రంథవి ...ము రసరత్నాకర మనుసంస్కృతగ్రంథమునుండి గ్రహింపఁబడియె.

* ఈనృసింహపురాణము దమత్కృతిమత్కృతిగ రచియించుటచే నెఱ్ఱాప్రెగడ ...ంథపుర మేశ్వరుఁ డనుబిరుదు గాంచె. శివున కత్యంతభక్తుఁ డగుటంజేసి శంభుదాసుండ ...ఁ పేరు వడసె, ఈకవి పదునాలవశతాబ్దముమధ్యమున నున్నవాఁడు. ఇతఁడు భారత ...నియారణ్యపర్వభాగంబును, హరివంశంబును, రామాయణంబును, రచియించెను.

డొంప తలిర్చె నామని స ♦ ముజ్జ్వలయోగరసాదనక్రియం
గొండొకపాయముల్ మగుడఁ ♦ గోరి భజించినసిద్ధుఁడో యనన్.

ఉ. ఎందును బుష్పసౌరభము ♦ లెందు నమందమదాలిఝుంకృతం
బె ను సాంద్రపల్లవము ♦ లెందును గోకిలకంఠకూజితం
బెఁ ను విస్ఫురత్ఫలము ♦ లెందును గోమలకీరభాషితం
బందము లయ్యె మందమరు ♦ దంచితచారువనాంతరంబులన్.

తే. నరసకింశుకకోరక ♦ సంచయంబు
చెలువు తిలకించె భావిన్య ♦ సింహదేవు
దీప్తనఖపంక్తి ప్రకటదై ♦ తేయరుధిర
సీకరుచి సొప్పుతెఱఁగు సూ ♦ చించినట్లు.

ఉ. కాముఁడు లోకమంతయును ♦ గైకొని పట్టము గట్టికొన్నఁ జే
రామని సేయుపండువుల ♦ యం దొడఁగూడినదివ్యగంధము
ల్నా మెఱుఁగారుక్రొవ్విరు లె ♦ లర్చిననంపెఁగ లొప్పెఁ గామిను
భ్రామితకామిచిత్తశల ♦ భంబులు గ్రందుగఁ జెంది మ్రందఁగన్.

చ. అవిరళచారుకోరకచ ♦ యంబులు లోకముచూడ్కులం దగం
దవులఁగఁ జేసె నెల్లెడలఁ ♦ దద్వవధూముల గాఢరాగముల్
యువతులచిత్తవృత్తముల ♦ నూఁప ననంగుఁడు సంగ్రహించె నాఁ
బ్రవితతలీలఁ దోఁచెఁ దరు ♦ రాజులఁ బువ్వులగుత్తు లామనిన్.

చ. తనియక క్రమ్మి వచ్చి చలి ♦ దాఁకినచొక్కునఁ గన్ను మ్రోఁ జం
చునఁ గసికాటుగాఁ గఱచు ♦ చు న్నలిఁ జూతజపల్లవమ్ము గై
కొని విహరించుఁ గోయిలలు ♦ గొమ్మలఁ గొమ్మలతియ్యమోవిమో
హనరుచిఁ బాసి వందుపథి ♦ కావలి కేఁకటఁజేసి యామనిన్.

సీ. అంచబోదల మోద ♦ మారంగఁ జెక్కిళ్లు, గొట్టు చొండొంటిఁ దో ♦ డ్కొనుచుని
నలిబాలికలు ముదం ♦ బెలరారఁ బింపిళ్లు, గూయుచు మధువులు ♦ గ్రోలి సో
జక్కవచా లక్క ♦ జపువేడుకలఁ దిమ్మ, దిరుగుచు నకరువుల్ ♦ దిగిచికొనఁగ
మలయానిలుఁడు గర్వ ♦ మలరంగ గురువులు, వాఱుచు నెత్తావి ♦ చూఱలాడ

12. కసికాటు (కసిడి+కాటు)=అల్పపుఁగాటు.



బసిఁడిగద్దియగా మిద్దె ♦ పైఁ గరంబు, ప్రీతి నెలకొని సిరి పేరు ♦ పెంపువడయు
కామినులచూడ్కి కేకుల ♦ కాంతి వడసి, దర్పమునఁ గ్రాల నొప్పారెఁ ♦ దమ్మివిరులు

వలివిరవాదిక్రొవ్విరుల ♦ వాతుల మూతులు పెట్టి తేనియల్
గోలఁదికి మీఱఁ గ్రోలికొని ♦ క్రొవ్వునఁ జివ్వల నూని యొక్కమై
దలముగ దీటుకట్టుకొని ♦ దాఁటెడు తేఁటులపేర నెల్లెడం
గలయఁగ వృక్షవాటికలఁ ♦ గ్రమ్మె నకాలతమోనికాయముల్. 14

గడమ్రాఁకుల మొదళులఁ ♦ బుష్పరసము
రఁగి నెత్తావి యెందును ♦ నెరయ నొప్పెఁ
చకోఱకు నై మున్న యిం ♦ పులు దలిర్పఁ
ఁడ వనలక్ష్మి యమిసిన ♦ క ల్లనంగ. 15

చినయశోకములయం
దినతుమ్మెదలరవము ♦ లిం పెసఁగ నొగిం
చువనదేవతలచర
చలితము లైనయందె ♦ యలమ్రోఁత లనన్. 16

లసితచంద్రకాంతమణి ♦ వేదులపై మృదుమారుతాహతిన్
ముగ రాలి తావి దగఁ ♦ దాఱినిపువ్వు లయత్నశయ్య లై
పుగ మాధవీవలయ ♦ ముల్ తరుణీతరుణవ్రజంబులం
మనోజలీలకును ♦ బేర్చుమదాకులభృంగగీతులన్. 17

లుకలపిండు నొప్పిదపుఁ ♦ జిత్రసురాయుధలీల యేపునం
లఁగుమధువ్రతావలుల ♦ చిక్కని మ్రోఁ తనుగర్జ యుల్లస
ఫలరసపూర్ణముం దెరలి ♦ పర్వుట సౌదల కాలమేఘపం
ప్రక్రియఁ దాల్చె భూరుహత ♦ తుల్ మధువేళఁ బయోదవేళ నాన్. 18

14. ఈపద్యమందు ఛలాద్యపహ్నవము.

15. 16. ఈరెండుపద్యములందుఁ బుష్పరసమును, దుమ్మెదలగవమును, దోహద ందు వచ్చెడునోటికల్లుగాను పాదతాడనజాతము లైనయందియలమ్రోఁతలుగాను ప్రేక్షింపఁబడియె. కల్లు త్రాగుట నిషిద్ధవ్యాపారమయ్యు విహారసమయమందుఁ దా ు వర్ణించుట కవి సమయము.

చ. మనసిజుమంత్రఘోషములు ♦ మన్మథునానతిమాట లిందిరా
తనయువిలాసహాసములు ♦ దర్పకునార్పు లెలుంగు లంగజ
న్మునిచదువుల్ మనోభవుని ♦ మోహనగీతు లనంగఁ జారుఖే
లనముల నెల్లదిక్కులఁ జె ♦ లంగె మదోత్కటకోకిలధ్వనుల్.

చ. అరుదుగఁ దేఁటితీఁగెగొన ♦ యం బెసఁగం బలుపచ్చవింట ని
బ్బరముగ మోపి కెందలిరు ♦ బత్తళికం బరువంపుమావిక్రో
వ్విరిపలుగాఁడితూపు లిడి ♦ బీరపుగర్వము నెమ్మనంబులోఁ
బిరిగొనఁ దోలి తొప్పటిలఁ ♦ బెట్టె ననంగుఁడు పాంథలోకముల్.

## * భోజరాజీయము, ఆశ్వాసము 3.

(కళింగదేశంబునం బుండరీకం బనుపురం బొండు గలదు. అప్పురం బేలునర పాలుండు సంపాతి యనునాతం డగణ్యరూపలావణ్యరేఖ యగుచిత్రరేఖం బెండిలియై యక్కాంతయందు సంతానంబు గానక కొంతకాలంబునకుఁ బరమేశ్వరానుగ్రహంబునంజేసి యొకకొమారిత యుద్భవిల్లుడు దానికిం బుష్పగంధి యనునామం బిడి ప్రేమంబునం బెనుచుచుండె. ఈమాడ్కినా మానినియు గోమునం బెరుఁగుచుఁ గ్రమంబున జవ్వనంబు ప్రాపించె నంత.)

క. జర యుడిపి మాకుఁ గ్రమ్మఱఁ
దరుణత్వం బొసఁగు మనుచు ♦ ధరణీదేవిం
బొరిఁబొరిఁ బూజించినక్రియఁ
దరమిడి కారాకు రాల్చెఁ ♦ దరుతతు లెల్లన్.

ఉ. పల్లవితక్షమాజములు ♦ బంధురకోరకితద్రుమంబులుం
బెల్లగుపుష్పితక్షితిజ ♦ బృందములు న్వనభూములందు శో
భిల్లెఁ బ్రసూనసాయకుఁ డ ♦ భీష్టవిహార మొనర్ప వచ్చుచో
నుల్లమునందు వేడ్క లిగు ♦ రొత్త వసంతుఁ డలంకరించె నాన్.

---

* భోజరాజీయము కృష్ణామండలములోనిశ్రీకాకుళమునకుఁ బ్రభువుగాడిన యంధ్రవల్లభునికొల్వులో మెలఁగిన తిక్కనయనువానికిఁ బుత్త్రుఁడైన యనంతావనిచే వ్రాయఁబడియె. ఈయనంతామాత్యుఁడు హూణశకము 1434 సంవత్సరమ దరువాతఁ గొంతకాలముదాఁక నున్నట్టు లగపడుచున్నది. ఇతనిచే రసాభరణంబును దస్సొకటియును రచియింపఁబడియున్నవి.



[illegible]నాయకుం డలరు ♦ గద్దియ యెక్కె వసంతవేళయం
[illegible] నెల్లవారలుఁ ద ♦ దుత్సవసంపదసొంపు చూడ రం
[illegible]లనాఁగలం దొఱఁగి ♦ యొంటి చరింపకుఁ డోవిటాలి యం
[illegible]రీతిఁ జాటునటు ♦ లామనిఁ గూయఁ దొడంగెఁ గోయిలల్. 23

[illegible] పువ్వులగుత్తులఁ
[illegible]రఁగెడిమకరందరసము ♦ తోయంబుగఁ ద
[illegible]లతలు చల్లులాడెడు
[illegible] విటీవిటులువోలె ♦ నాసమయమునన్. 24

[illegible]గంధవాహనిక ♦ రావలి నొక్కొకచోటఁ బుష్పరే
[illegible] లెగయంగ నప్పుడు మ ♦ నోభవుఁ డశ్వముఁ దోలుచో ఖురో
[illegible] శీపరాగములు ♦ పర్వెనొకో యని యెల్లవారలుం
[illegible] నెప్ప జగ ♦ తి న్వనభూములు గొన్నిచోటులన్. 25

[illegible] యుద్రమోఁత గడు ♦ శ్రోత్రసుఖం బగుగర్జచాడ్పుగం
[illegible]ండముల్ బెరసి ♦ తోయదరీతిఁ జరింపఁ బూవులం
[illegible]నియల్ దొరఁగఁ ♦ గాఁ బురి విచ్చి మొగంబు లెత్తి మో
[illegible]డుఁ గేకిసము ♦ దాయము కాంతవిలాస మొప్పఁగన్. 26

[illegible] జూచినం జిలుక ♦ లెయ్యెడఁ జూచినఁ గోకిలంబు లే
[illegible] జూచిన న్సమది ♦ షట్పదసంఘము లెందుఁ జూచినం
[illegible]ప్రశారికారుతుల ♦ సొంపు నుతింపవశంబె పువ్వుఁదే
[illegible]ంచసాయకుఁడె ♦ యెద్దెసఁ జూచిన నెవ్వనంబునన్. 27

## * విక్రమార్కచరిత్రము, ఆశ్వాసము ౫.

([illegible]ద్రగుప్తుం డనుబ్రాహ్మణునకును రాగమంజరి యనుక్షత్త్రియస్త్రీకిని [illegible] చిన విక్రమార్కుం డనురాజచూడామణి వదాన్యత్వంబునను బరాక్ర

---

23. ఈపద్యమందుఁ గోకిలములకూఁత లొక్కవిధముగానే యుత్ప్రేక్షింపఁబడియె. [illegible] పద్యమందుఁ బెక్కువిధముల నుత్ప్రేక్షింపఁబడియున్నవి.

26. ఈపద్యమందు వసంతర్తువు వర్షర్తువుగా వర్ణింపఁబడియున్నది. 18 వ పద్య [illegible]ట్టి. అయినను దీనియందుఁ బ్రయోజన మెక్కువగా నున్నది.

27. ఈపద్యమునందును 8 వ పద్యమునందును వర్ణన మేక మయ్యును రచనాభేద [illegible]చునది.

* [illegible]ణశకము 1430-1447 సంవత్సరములకు మధ్యకాలమున విక్రమార్కచరిత్రము

మంబునను బేరువడని యుద్ధంబున శకక్షోణీశ్వరుని సంహరించి విదర్భేశ్వరుని రక్షించి తద్విదర్భాధిపతనయ యైనయనంగవతి యనునతివం బరిణయంబై యభిమతసుఖంబుల ననుభవించుచుండె నంత.)

సీ. రాజకీరకుమార ♦ రాజి కక్షరశిక్ష, యొనరింప వచ్చిన ♦ యొజ్జ యనఁగఁ
గలకంఠనికురుంబ ♦ కములకు వాకట్టు, విడిపింప వచ్చిన ♦ వెజ్జనంగఁ
దరులతాదులకు వా ♦ ర్ధకము మానఁగ మందు, సేయంగఁ వచ్చిన ♦ సిద్ధుఁ డనఁ
సంప్రణయప్రక్రోధ ♦ జంపతినివహంబుఁ, గలుప వచ్చినచెలి ♦ కాఁ డనంగ
తే. మందమారుతోద్ధూతమ ♦ రందబిందు, సిక్తషట్పదజ్యారవ ♦ శ్రీవిలాస
మకరకేతుప్రతాపన ♦ మగ్రమై వ,సంత మేతెంచె నంతతో ♦ త్సవ మె ప్ప.

క. వలరాజుమూలబల మగు
నలికుకపికములకుఁ జైత్రుఁ ♦ డభిమతభోజ్యం
బులఁ గూర్చె ననఁగఁ దరువుల
నలరులుఁ దలిరులును బండ్లు ♦ నక్కాజ మయ్యెన్.

క. కిసలయకింజల్కరస
ప్రసవశలాటుప్రభాప ♦ రంపర లెసకం
బెసఁగ మకరందవృష్టికిఁ
బొసఁగంగా నింద్రధనువు ♦ పొడమినభంగిన్.

మ. కనదంభోజముఖీనపీనపదరా ♦ గవ్యాప్తిపూర్వంబు గా
నను నుల్లాసముఁ బొందె నంపెఁగలు నా ♦ నాకాననశ్రీప్రమో
దిను లభ్యాగమవేళఁ జైత్రునకు నా ♦ తిథ్యంబు గావింప నె
త్తిననీరాజనదీపమాలిక లనన్ ♦ దేదీప్యమానంబులై.

చ. పరువపుఁబుప్పరేణువుల ♦ పై మకరందపువెల్లి డొల్లి బం
ధురవనదుర్గమార్గ మతి ♦ దుర్గమమై చెలువొంద సెందు న

---

రచియింపఁబడినది. ఈగ్రంథము రచియించినవాఁడు జక్కన. ఇతఁడు పెదఁ యన్న
త్యపుత్త్రుఁడు. కృతినాయకుఁడు సిద్ధనమంత్రి. ఈసిద్ధనమంత్రితండ్రియగు జన్న
విష్ణుపురాణమును దెలుఁగున రచించినవెన్నెలగంటిసూరన్నతాతయైన వె న్నెల
ర్యుఁడును దోఁబుట్టువులు.



రుగ మందమందగతిఁ ♦ జెందె మహాబలుఁ డయ్యెఁ జాల దు
రయి కన్నెతావు లగు ♦ తావులవేగున వాయు వామనిన్. 32

లఁ బట్టి తెచ్చి మన ♦ వీట భటావలి నెవ్వరైనఁ బూఁ
లపాలు సేయమియ ♦ తప్పు సుఁడీ యని చాటుచున్నశం
ఘంటికారవము ♦ భంగిఁ జెలంగె నశోకతాడన
విలాసినీచరణ ♦ భూషణఘోషణ మెల్లతోఁటలన్. 33

వసంతలక్ష్మి
లై నిరుపమాన ♦ తేజోగరిమం
లు తరళనయనా
ంబులు చూడఁ జూడఁ ♦ దిలకము లొప్పెన్. 34

† ఆముక్తమాల్యద, ఆశ్వాసము ౫.

ష్ణా- త్తముఁ డగువిష్ణుచిత్తుం డనువాఁ డొకనాఁ డొకతులసీవనంబున క్షితాంగి యగునొకబాలం గనుంగొని యత్యంతహృష్టుఁ డై గొనిపోయి తనకు శిశువుఁగాఁ గైకొని పెనుచుచుండె. మఱియు బాల్యంబు వాసి క్రమంబున యౌవనంబు బ్రాపించి శ్రీవిల్లిపురియుందలివిష్ణువునం దతిభక్తి గల్గి ద్రావిడప్రబంధంబున నద్దేవునిఁ బాుం బూజించుచుండు. మఱియు నవ్వనిత తాను దాల్చి విడిచినపువ్వలికల స్వామి కిచ్చుటం జేసి యాముక్తమాల్యద యనుపేరం బరంగి దేవునియందు యాసక్తి గలదై యుండ సూర్యుఁ డుత్తరాశం బ్రవేశ.)

---

ఈ పద్యమందలిదోహదమునకును 16 వ పద్యములో నున్నవర్ణనమునకును గల ర్తించునది.

తిలకిత=పుట్టినగుఱుతులుగల. తిలకములు=బొట్టులు; బొట్టుగుచెట్లు; బొట్టు తరళనయనాతిలకంబులు=లోలాక్షీమతల్లికలు; మేటిసెలఁతలు, బొట్టుగునకు షీ ణము. ఆయావృక్షములకుఁ జేయఁదగినదోహదక్రియలు—అశోక శ్చర వకులో ముఖసీధునా, ఆలిఙ్గనా త్కురుబక, స్తిలకో వీక్షణేన చ, కరస్పర్శేన ముఖరాగేణ చమ్పకః, పల్లవతే కర్ణికారః, సిన్దువారో ముఖానిలాత్, ః ర్నితరాం, నమేరు ర్గానితేనచ.

ముక్తమాల్యద కృష్ణదేవరాయలచే రచియింపఁబడియె. ఈకృష్ణదేవరాయలది ము. ఇంటిపేరుసాళువవారు. ఇతనిపూర్వు లంతకుమున్ను వసియించినగ్రామ

తే. కినిసి వలరేఁడు దండెత్తఁ ♦ గేతువగుట
మీన మిలఁ దోఁచు టుచితంబ ♦ మేష మేమి
పని యనఁగ నేల విరహాఖ్యఁ ♦ బాంథయువతి
దాహమున కగ్గి రాఁగఁ ద ♦ త్తడియు రాదె.

చ. ప్రియపరిరంభణప్రథిమ ♦ పెల్లికఁ జైత్రుఁడు వచ్చి చేయఁగా
న్యాయ మని సీతునందచెలు ♦ వల్పెదవు ల్దడుపంగ వచ్చెఁ దా
రయమునఁ జేర్చి యాఋతువు ♦ రాఁ జలి విచ్చి తొలంగి రయ్యవ
స్థ యుచితమేకదా విపది ♦ ధైర్య మనం జనుమాట యింతకున్.

---

నామములంబట్టి సంపెటవా రనియు సెలగోలవా రనియు గృహనా ంలు
ఈతని రాజధాని బళ్లారిమండలములోనియానెగొందికి సమీపమునఁ ద ఛదాఁ
దున్న విజయనగరము. ఈవిజయనగరమునకు విద్యానగర మనియు నా ంతరమ
పట్టణము విద్యారణ్యస్వామి యని మహాప్రసిద్ధి గాంచిన మాధవాచార్య ారియ
గట్టఁబడినది. ఈతఁడు హూణశకము 1484 వ సంవత్సరమునఁ బుట్టి వ గ
మున సింహాసన మెక్కి 1530 వ సంవత్సరముదాఁక నున్నట్టు తెలియవ ఆంధ
నాదరించి కవులను సమ్మానించి గ్రంథరచన చేయించుటచేఁ గృష్ణదేవరా ు క
భోజుఁ డని బిరుదు గలిగె. ఇతఁ డితరులచేఁ గావ్యములను జేయించుటయేకాక త
విద్వాంసుఁడై సంస్కృతాంధ్రంబులందు గ్రంథముల రచియింప సమర్థుఁడై య
ఈతఁడు కళింగదేశముపై దండెత్తి విజయవాటిం గొన్నిదినంబు లుండి శ్రీకాకుళనిఁ
దైనమధుసూదను సేవింపం బోయిన హరివాసరమునాఁటిరాత్రి యాదేవుఁడు స్వ
నం దోఁచి వేంకటేశ్వరున కంకితముగాఁ దెలుఁగుగ్రంథమును జేయు మన గా నీకృ
రాయలు విష్ణుచిత్తీయ మనునామాంతరము గల యాముక్తమాల్యదను రచియిం
లీగ్రంథములోనే తాను దెల్పియున్నాఁడు. ఈతఁడు విజయవాటికి(అనఁగా బెజవా
వచ్చినది హూణశకము 1515 వ సంవత్సర మగుటచేత నీగ్రంథము నాసంవత్సరమ
చేయనుద్దేశించి యారంభించి యుండును. ఈపుస్తక మల్లసాని పెద్దన రచియించి యు
డని కొంతవట్టు వాడుకయున్నను గృష్ణదేవరాయలే రచియించినట్టు సిద్ధ ంతపఱ
యున్నది. ఈపుస్తకమందలి పద్యములు మొత్తముమీఁద శ్రుతి కటువులుగా గ
బెక్కుపద్యము లర్థగాంభీర్యము గలవిగా నుండుటయేగాక మృదుపదవిరచిఁ
యున్నవి.

36. 'విపది ధైర్య మ థాభ్యుదయే క్షమా, సదసి వాక్పటుతా యుధి వి
యశసి చాభిరుచి ర్వ్యసనం శ్రుతౌ, ప్రకృతిసిద్ధ మిదం హి మహాత్మనా' మనిభ



ఉ. స్పష్టబహుప్రణం బయిన ♦ సీతున కళ్కి నిజోష్ఠపల్లవో
చ్ఛిష్టముఁ గొన్న దిమ్మఘ వి ♦ సీ యన కింతులు మోవిఁ దన్మధూ
చ్ఛిష్టముఁ గొన్నయొచ్చె మఱఁ ♦ జేసిన వారు కృతం బెఱింగి వి
స్పష్టముగా నొనర్చిరి వ ♦ సంతున కూఱట దోహదంబులన్. 37

ఉ. మునుపే చంద్రబలంబు గల్గి మలయం ♦ పుంగమ్మతేగాడ్పుఁదే
రున నేతెంచులతాంతబాణునకు సూ ♦ ర్యుండు న్మహిం గ్రొత్తగా
కూలించెఁ జలంబున న్విరహిణీ ♦ ప్రాణాపహారంబు సే
వ యూహించువిధాతకృత్య మది యే ♦ లా మాన్చు నెప్పట్టునన్. 38

ంయకటకోటజస్థిత
శీసుతసేవ నిట్లు ♦ గనెను తదాశా
డనఁగ నలసవృత్తిన
పచు నాపోశ నించె ♦ మిహికాజలధిన్ 39

లయతరున్యాయమ యిలఁ
ంతరువుల కెల్లఁ జేయఁ ♦ గాఁ బొలసెఁజుమీ
ంలరించు నెపంబునఁ బరి
ళితములుగ ననఁగ నచటి ♦ మారుత మొలసెన్. 40

---

షితశ్లోకము. ఈశ్లోకములోని 'విపది ధైర్య' మనునంశ మీపద్యమందు గ్రహింపఁ
బన్నది.

37. వసంతుఁడు స్త్రీలకుఁ గల్గినయొచ్చెముం దొలఁగింపఁగా స్త్రీలును దత్కృతం
మాఱుగా దోహదంబులచే వసంతున కూఱట యొనర్చి రని వర్ణించుటచే నీ
ందలి యలంకారము పరివృత్తి. పరివృత్తి యనఁగా వస్తువు నిచ్చి వస్తువును బుచ్చు
. దోహదలక్షణము— 'తరుగుల్మలతాదీనా, మకాలే కుశలైః కృతమ్, పుష్ప
ద్యుదకంద్రవ్యం, దోహదం స్యా త్తు తత్క్రియా'. దోహద మనఁగాఁ దరుగుల్మ
ల కకాలమందుఁ బుష్పములు మొదలైనవానిని గలిగించెడుద్రవ్యమునకును, నట్టి
పను పేరు.

38. ఈపద్యమునందలి యలంకార మర్థాంతరన్యాసము. నాలవపాదములోని
ప్లుతయతి.

మ. అరుణాంశుండు హిమర్తు వ్రజని డీ ♦ లై క్రుంకి పుష్పర్తువా
నరకల్యాదితుఁ డౌచు మున్న యుదుటన్ ♦ శ్యామాంచితాలేపసం
కరసాంద్రాగ్నిశిఖారుణప్రభఁ గొనెం ♦ గాకున్నఁ గాలజ్ఞప
త్త్రిరుతం బెట్లు చెలంగు మానకుపిత ♦ స్త్రీకర్ణదంభోళియై. 41

తే. మృగమదాలేపమును మాని ♦ రగరుకలన
నెన్ని యెదమీఁది కొప్పిరి ♦ బన్నసరము
లొంటికులు వేరుపోఁచకుఁ ♦ గంటగింప
రైరి తుటిమెడుసరపువ్వు ♦ లం దతివలు.

చ. చిలువసుధారసాధరల ♦ చెల్వపుఁబుక్కిటితావిఁ దీయనై
వలపుల నందుతత్ప్రియుల ♦ వక్త్రవిషజ్వలనోష్మ నెట్టనై
వెలువడి తద్గుణద్వితయ ♦ వేధఁ జుమీ యన మ్రానుషట్టుటల్
దలిరులు పుట్టుట ల్గలుగఁ ♦ దాఁకొనెఁ జందనశైలవాతముల్.

మ. మదనస్యందనతాస్వనృత్తిఁ దెలిపెం ♦ జాటీరభూభృద్వల
న్మృదువాతం బతిపక్వపాదపలతా ♦ వృంతావళీమూలరం
ధ్రదళ త్పంకజకర్ణికాగణహరి ♦ ద్రాభంగభాభాసుర
చ్ఛదనచ్ఛద్మవివర్తికాంచనకన ♦ చ్చక్రచ్ఛటాచ్ఛిత్కృతిన్.

వ. తదనంతరంబ.

---

41. కాలజ్ఞము=కోడి, కోయిల. 'వసన్తకాలే సంప్రాప్తే కాకః కాకః పిక' యన్నట్లు కోయిలకూఁతలు వసంతకాలమందుఁ దెలియు నని భావము. ఈప దనుమానానుప్రాణిత రూపకాలంకారము. అనుమానలక్షణము:— తెలిసికొనన యొకవస్తువును దద్వస్తుచిహ్నముచే నిశ్చయించుట. అనుప్రాణితము=సమర్థింపఁబ

42. ఇందు స్వభావోక్త్యలంకారము. వస్తువులస్వభావమును వర్ణించుట లక్షణము.

44. చెట్లయందుండియుఁ దీఁగెలయందుండియుఁ బండుటాకులు తొడిమ తామరమిద్దెలవలెను బసుపుతునకలవలెను బచ్చనై కొంచెముధ్వనితోఁ దిరుగుచుండె న నట్లు తిరుగుచుండుట మలయవాయు వనునట్టి మన్మథరథమునకుం గలబంగారుచక్ర తిరుగుచున్నవో యన్నట్లుండె ననియు భావము. ఈపద్యమందు ఛలాద్యపహ్నవ



సీ. క్ష్మావశారక్తరాం ♦ కవ మరణ్యానీమ, ధూదితారుణిమ వ ♦ ల్ల్యురగరసని
కోద్గతి తరుగరు ♦ త్మద్గరుద్గణ ముద్భి, దాహార్యజీమూత ♦ రోహితంబు
నవమిళిందప్రాఘు ♦ ణకనిమంత్రణశోభ, నాక్షత్రపతతి వా ♦ యసవిభక్త
పరభృతౌఘప్రాప్త ♦ పత్త్రిక మాలతీ, త్రాసామయావహా ♦ ర్ద్రిక్షితజము

తే. ప్రమదవనవనదేవతా ♦ సముదయాంగ, రాగ మినజహరిజ్జగ ♦ త్ప్రాణశాణ
కషణదళితదళాంతసం ♦ క్రాంతకాంతి, ఘనమణిశలాక చిగురాకు ♦ గలయ మొలచె.

తే. శరనిధుల మాఘ్యములు దీరె ♦ మరున కట్టి
యడలున జయింతు మనికదా ♦ యద్దినాళిఁ
గ్రూరతిథిఁ గృష్ణరజనిఁ ద ♦ ద్వైరుఁ గనియుఁ
బెద్ద లివురాకుఁబట్టాలఁ ♦ బెట్టువడిరి. 47

తే. అవని నపుడు నవోఢితుం ♦ డైనయట్టి
మరునకుం గుసుమర్తు వ ♦ న్మంత్రసాని
గోసినకొడవలి ♦ వోలె విరహి
కం బయ్యెఁ గింశుక ♦ కోరకంబు. 48

చ. కుః మము లెల్లఁ గామినుల ♦ కొప్పుల నుండ నటుండ లేమి ని
గ్గఁగఁగ వంగినట్లు జని ♦ యించె నన ల్మతి వంగి జీవితే
శస ఖతి గొమ్మలం గరఁచి ♦ చల్లఁ దగన్ క్షణికాంగరాగ మా
టసదె యటంచు రాగిలిన ♦ యట్టులు రాగిలి విచ్చెఁ గింశుకిన్. 49

ఉ. నైపుణిఁ జందనాద్రిగహ ♦ నద్రుమసౌరభవీచిఁ దామ్రప
ర్ణీపరిలబ్ధమౌక్తికమ ♦ ణిప్రకరంబులు దోఁచి దక్షిణా
శాపవనుండు సల్లువెదఁ ♦ జల్ల జనించెనకాక వీని కే
లా పొడమంగ నప్పొలప ♦ మప్పుడు నా వనిఁ దోఁచెఁ గ్రొన్ననల్. 50

---

46. ఈపద్యమందుఁ జిగురాకు పెక్కుతెఱంగు లైనయొత్తిదాళువస్తువు లై యున్నట్లు వర్ణింపఁబడియున్నది.

50. ఇందు మొగ్గలవర్ణనము:—వనములలో ముత్యములవంటిరూపము గల్గి పరిమళముతో మొగ్గలు పుట్టఁగా, మలయమారుతము తామ్రపర్ణీనదిలోని ముత్యముల నేఱి మలయవృక్షపరిమళతరంగములలో ముంచి యాముత్యములనే విత్తినకారణంబుచేత నవి మొలక లెత్తినవేకాని లేనిపక్షమం దీమొగ్గల కాళ్ళంగార మేల వచ్చును ! రాదు.

క. వీరుద్ద్రుమిథునమేళన
కై రతిపతి యేయు దుస్సి ♦ హారితద్యుతిఁ బై
నా రెగయఁ బొటమరించిన
నారసములమొన లనఁగ ♦ నన లవి మించెన్. 51

చ. తనయుదరంబునం బొడమి ♦ తామ్రరుచిచ్ఛట లుల్లసిల్లఁ గో
ల్కొనుధరణీజసంతతికిఁ ♦ గోరకదంతము లించుకంత ని
క్కినయది యాదిగాఁగఁ జెలఁ ♦ గె న్వనలక్ష్మి గడుం జెలంగఁగాఁ
జనుఁ బ్రియుఁ డైనమాధవుని ♦ సంగతి మీఁదటఁ జాలఁ గల్గుటన్. 52

సీ. మును నన ల్దమిఁ బట్టి ♦ ముంగాళ్ల ముక్కుజోఁ, డనలఁ బీలిచి పసు ♦ రొక్కనిన విడిచి
పరువంపువిరిగొండు ♦ లరసి చా లైత్రోవఁ, బెట్టి యీరము లీఁగు ♦ పిండుఁ దగిలి
క్రొవ్విరిఁ దొలుత నె♦క్కొఁడు గని యది వ్రాలు, తఱి దానిఁ దాఁ బడఁ♦వాఁకి క్రోలి
యాకురాలుపుగంప్ల ♦ నా నెడునాస నిం, తడు గూఁది బం కంటి ♦ య[illegible]లార్చి
తే. యొట్టకేలకు నెకఁ డబ్బఁ ♦ బొట్ట నిండఁ, గ్రోలి యది గాలిఁ గదలినఁ♦గూలు [illegible] చుఁ
బ్రమదవనపాలికలు వేడ్కఁ ♦బట్ట నగుచు, మధుదినాది క్షుధాభ్రమ♦న్మధుప[illegible] ము.

సీ. మరుమాఘమలయాహి ♦ గరఘూర్ణ్య లనుగళ, న్మనసిజరథపరాం ♦ జనకళికఁ
త్రాసధావచ్ఛిశి ♦ రత్యక్తబాష్పము, ల్పికపంచమస్వరో ♦ ద్భేదవీణ
లబ్ధాగమ న్స్మరం ♦ దాసారజంబువు, ల్హిందోళసాక్షాన్ము ♦ కుందరోచు
లభిసారికాంశుకో ♦ ద్యన్నీలగుళికలు, జాత్యనుల్లసనాత్త ♦ శాపతతులు
తే. చైత్రసంజీవనౌషధీ ♦ జాతచేత, నాత్మజనిహేతుతరుపున ♦ ర్యాయియుపతి
కరవిఘూతహసంతికాం ♦ గారచయము, లళులపంక్తులు వనుల న♦త్త్రాడఁ దొడఁగె. 54

---

52. తమబిడ్డలకు దంతములు మొలచునంతదాఁక బాలెంతలు పురుషులఁ జేరరా దనుస్మృతివాక్యముంబట్టి వనలక్ష్మి తనయందుఁ బుట్టినవృక్షసంతానమునకు మొగ్గ లనునట్టి దంతములు రాఁగాఁ బ్రియుఁ డైనమాధవసాంగత్యమును బ్రతీక్షించుకాలము దోఁచుటచే సంతోషపడె ననిభావము.

53. ఇందుఁ దుమ్మెదలవర్తనము వర్ణింపఁబడియె.

54. ఈపద్యములోఁ దుమ్మెద లనేకవిధము లైన నల్లనివస్తువు లై యున్నట్లు వర్ణింపఁబడియె. ‘శి. గస్య వసన్తస్య సధ్యా హిన్దోళ రాగక’ యని సంగీతశాస్త్రప్రసిద్ధముగావున నప్పుడు హింద [illegible] రాగము పాడవలయును.



తే. ద్విజతఁ గాంచియు మధుసేవ ♦ విడువ లేక
జాతిఁ బాసినతేంట్లని ♦ స్వనముఁ గూడు
కొనుటనో యనఁ గోకిల ♦ స్వనము నెలఁగెఁ
దనకు మఱి పంచమత్వంబు ♦ దప్ప కుండ. 55

ఉ. పూచినమావులం దవిలి ♦ పూవిలుజోదున కమ్మె మాధవుం
డేచినశంక నాతఁ డవి ♦ యే కొనియే పథికావళీజయ
శ్రీచణుఁ డయ్యె నట్టిద య ♦ కృత్యముచే నగునట్టిపీడయున్
గోచర మానె దైవ మను ♦ కూలమునై పరుమేలు దీఱినన్. 56

మ. ఉరుశక్తి న్మధుమాసదోగ్ధ పిదుకన్ ♦ జ్యోత్స్నాగవీచంద్రమ
స్సు[illegible] రాధగిప్రతిముక్త మైననిబిడ ♦ జ్యోత్స్నాపయగిపూరము
ని[illegible] బాఱినగొజ్జెఁగ ల్గురియు ము ♦ న్నీ రైనయక్కమ్మనీ
[illegible]ం గూడిన వేర్వరించు గము లై ♦ రోలంబకాదంబముల్. 57

ఉ. [illegible]ం నంచ దూఁడు గొని ♦ తీరవనేక్షువువంకమీఁదుగా
న[illegible]క పుల్లకేసరము ♦ నందు వసింపఁగ నెక్కునూలినుం
బ్ర[illegible]ము నం దనారతము ♦ రందసరస్యరవిందగోష్ఠికి
న్నెగ్గల మాడు తేంట్లు మరు ♦ వింటికిఁ బూనె గుణద్వయత్వమున్. 58

---

56. గుజ్జములకు శరీరములు పూచెనేని యవి కీడు సేయుట యశ్వశాస్త్రప్రసిద్ధము. పూచుటచేఁ గీడు చేయవలసినగుజ్జములు జయప్రదము లైనట్లు వర్ణించుట వలన వ్యాఘాతాలంకారము. పద్యముకడపట నర్థాంతరన్యాసము. వ్యాఘాతలక్షణము:-ఏది యేకార్యమునకుఁ బ్రసిద్ధసాధనమో యాసాధనమే యాకార్యమునకు విరుద్ధ మైనమఱియొక కార్యమునకుఁ గూడ సాధనముగా గ్రహింపఁబడుట.

58. మన్మథధను వైనచెఱకునకు రెండల్లెతాడులు గల్గినట్లు వర్ణించుట—ఒక సరస్సులోనుండి హంస తామరతూఁడు త్రుంచుకొని దానిగట్టుననున్న చెఱకువంకమీఁదుగాఁ బొన్నచెట్టుపై వ్రాలఁగా నాబిసనాళతంతువు లాచెఱకునకుఁ దగులుకొని యది యొక యల్లెత్రా డాయెను. మఱియు నాపొన్నపువ్వులతేనియకును సరస్సునందలితామరలకును నెడతెగక వాలుగట్టి యాచెఱకువంకమీఁదుగానే తిరుగు చున్నతుమ్మెదలు మఱియొక యల్లెత్రా డాయెను.

చ. నిడుదమధూళిక ల్నడుమ ♦ నే కొని తీఁగెలు సాఁగఁ జుట్టుకొం
చడవిఁ గడారకాచకట ♦ కాకృతి సుళ్లు మెలంగె గాడుపు
ల్జడగతి నధ్వనీనపరి ♦ షత్పటునిశ్వసితానలం బెదు
ర్పడ మఱి సార్చులై సుఱసు ♦ లం దుద సుళ్లుగ సుక్కెనో యనన్. 59

చ. తరుణు లవోనిదానమధు ♦ ధార నన ల్వకుళాళి నింపఁగాఁ
దరుణుల మేముఁ గామె యని ♦ తద్గత లై వనదేవత ల్సరన్
ధర వకుళౌఘ మెల్లను న ♦ న ల్గనఁ గ్రాయఁగ నించుబుగ్గలన్
దొరసె మధుప్రపూర్ణత మ ♦ ధూకములం బృథుపాండుపుష్పముల్. 60

చ. తరుణులకౌఁగిట న్ననుచు ♦ తమ్ము వృథా విరు లెత్తి చేసె మో
పరులుగఁ జైత్రుఁ డంచుఁ దద ♦ భావమనోభవవహ్ని వెచ్చి ని
ర్భరమధుపాళిధూమముఁ బ ♦ రాగపునీఱును దేనెగట్టెచాఁ
దరుదుగఁ దాల్చెఁగాఁ గొరవు ♦ లై యొఱగం బడెఁ గొన్నిభూజముల్. 61

---

59. సుడిగాడ్పులవర్ణనము:— పువ్వులనుండి జాఱెడుమకరందధారల ందఁ బడకుండ నడుమనే గ్రహించి తీఁగలుతీఁగలుగా సాఁగునట్లు చుట్టుకొనుచు వాఁయువులు కపిలవర్ణము గలగాజులవలె సుళ్లుసుళ్లుగాఁ దిరుగుచుండెను. అట్లు దిరుగుచుండుట యెట్లుండె ననఁగా, విరహుల నేఁచ వచ్చినవాయువులు వారినిట్టూర్పుచిచ్చుచే వడుకొన్నవై మంటలతో సుళ్లవలె ముడుఁచుకొని ముక్కిపోయెనో యన్నట్లుండెను. ఇందుఁ గపిలవర్ణము గలమకరందధారలు గుండ్రముగాఁ దిరుగుట మంటలసుళ్లవలె నుండె ననుట.

60. వకుళదోహదము:— 'వకుళో ముఖసీధునా' యని యున్నదిగాన ముఖమద్యముచే స్త్రీలందఱును బొగడచెట్లను బుష్పింపఁజేయఁగా వనదేవతలు గూడ 'మేము స్త్రీలము గామా ? దోహదముచేఁ బుష్పింపఁజేయలేమా !' యని పొగడచెట్లను బుష్పింపఁజేయుటకై యుమియుటకొఱకుఁ దెల్లనిమద్యముచే నిండించుకొన్న బుగ్గలో యన్నట్లుగా నిప్పచెట్లలోని తేనెతోఁగూడిన తెల్లనిపువ్వు లుండె ననిభావము. ఈపద్యమందలి వర్ణనమునకును 15 వ పద్యమందలివర్ణనమునకును గలభేదమును గుర్తించునది. ఈపద్యము మొదలు 70 వపద్యముదాఁక దోహదములు వర్ణింపఁబడియున్నవి.

61. కురువకదోహదము:— 'ఆలిఙ్గనా త్కురువక' యని యుండుటచేఁ దరుణుల కౌఁగిటఁ గురువకములు పుష్పించును. ఈ పద్యమందు గమ్యోత్ప్రేక్ష.



ఆ. ఫలశలాటు లురల ♦ నళులకై తమహాడు
చెఱుప మావు లంటి ♦ చెలువపిండు
మగుడ ననలు నింప ♦ మొగముఁ గన్నులు నెఱ్ఱ
వాఱె మిగుల శౌక ♦ పైకములకు. 62

మ. అతులప్రేమరసార్ద్రి యోర్తు ప్రియుహా ♦ స్వక్రీడసంకేతవం
చిత యై తత్క్షణజాంగజజ్వరమిళ ♦ చ్చిత్తభ్రమం బూని నా
పతి నోవృక్షమ కానవే యన సపు ♦ ష్పం బయ్యె గోఁ గంతలో
నతఁడుం దోఁచిన నవ్వడు న్విరిసెఁ బ్రాం ♦ తొంచన్న మేరుద్రుపున్. 63

తే. స్థాణు వొక్కండు మగవాఁడు ♦ దలఁక కుమియ
ఫల మొసఁగె నట్టె కినియక ♦ పద్మవదన
వదనసురఁ గూర్మి నొసఁగ నీ ♦ వలదె సుమమ
యినను ననుమాడ్కి నుమిసిన ♦ ననిచెఁ బొగడ. 64

---

62. మామిడిదోహదము:— 'కరస్పర్శేన మాకంద' యని యున్నది గానఁ జెలువలు మామిడిచెట్టు నంటి పువ్వుల నించి రని చెప్పఁబడియె.

63. గోఁగు సురపొన్నలదోహదము:— ఒక స్త్రీ తనప్రియుని సంకేతస్థానమునఁ గానని దై వేదనతో 'నోవృక్షమా నాపతిం గానవా' యన్నమాత్రన 'సల్లాపతగి కర్ణికార' యని యున్నది గాన దగ్గఱ నున్నగోఁగు పుష్పింపఁ గలిగెను. అంతలో పలఁ దనభర్తకనఁబడుటచే నాస్త్రీ నవ్వఁగా సురపొన్నచెట్టు 'నమేరుర్హాసితేనచ' యని యున్నది గాన వికసింప నాయెను.

64. వకుళదోహదము:— స్థాణువుపై (అనఁగా శివునిపై) బోయతిన్నప్ప యనువాఁడు పూజార్థము పుక్కిటిసుర నుమియఁగాఁ గోపింపక వానికి స్థాణువు (శివుఁడు) కామితఫలము నిచ్చె ననుశ్రీకాళహస్తి మాహాత్మ్యకథ నాధారము చేసికొని ఒకమగవాఁడే తనమీఁద నుమియఁగా స్థాణువు (మొద్దు) ఫలమునే (పండు) యిచ్చెనుగదా, అట్లుండఁ బద్మముఖియొక్క వదనసురచేతఁ బుష్ప మైనను నీయవలదా యన్నట్లు('వకుళో ముఖసీధునా' యనుట ననుసరించి) తనమీఁద నుమియఁగానే పొగడచెట్టు పుష్పించె నని భావము. ఈపద్యమందలిదోహదమే60వపద్యమందుఁ జెప్పఁబడినదిగాని 60 వపద్యమందు దోహదమును వనలక్ష్మి సంపూర్ణముచేసినట్లు వర్ణింపఁబడ దయ్యె.

తే. మధువుఁ గాంతలపుక్కిటి ♦ మధువుఁ జేల్ల
యీర్ష్యఁ బన నూప బొగడపైఁ ♦ నెలయ దాన
విరిసెఁ దొల్లిటిదళములు ♦ విరులు జడిసె
దీన నగ్గల్పునకు నుబ్బి ♦ తేఁటు లార్చె. 65

ఉ. మేకొని తాచినన్ భృగువు ♦ మెచ్చినవానికి మర్త్యభార్య యా
శ్రీకి నివాసమై చెలిమి ♦ సేయుట నిట్టిప్రశాంతి గల్గెనో
కా కన నాతి దన్నిన వి ♦ కాసము నొంది వనస్థలస్థితా
శోకము సేసె మెచ్చునఁ బ్ర ♦ సూనరజఃకనకాభిషేకమున్. 66

మ. అళు లేతద్వదనేందురాగమిళనా ♦ ప్రాదుర్భవత్కోరకం
బులతేనె ల్సుధ లంచు రా నెకతె నె ♦ మ్మో మెత్తఁ జైత్రంపుఁబు
వ్వులలోఁ దగ్గుణు లౌనె గంధఫలిఁ బు ♦ వ్వు ల్పుట్టి పోఁదోలె ను
చ్చెల చేఁదై తఱి చెందుఁ దల్లిబడికో ♦ ల్సేకూరుఁగాదే మహిన్. 67

---

65. వకుళమును గుఱించి మఱియొక వర్ణనము:—వసంతమాసమునకును మద్యమునకును మధు వని పే రుండుటచే సమాననామత్వవైరమువలనఁ దమతమసంపద పొగడ చెట్టుపైఁ గనఁబఱుపఁగా స్త్రీలపుక్కిళ్ళమధువుచేఁ జిగిరించి పుష్పించి యున్నయాకులను బువ్వులను రాల్చి వసంతర్తువు పొగడను బుష్పింపఁజేసె ననియు మరలఁ బూచినపువ్వుల కలరి తుమ్మెదలు మ్రోసెననియు భావము.

66. అశోకదోహదము:— తొల్లి భృగుమహర్షి తన్నఁగాఁ గోపింపక మెచ్చుకొన్నవిష్ణువునకు భార్యయైనసీతకును దనకును లంకలో నివాసస్థాన మగుటంబట్టి చెలిమి గలిగిన సంబంధముచేత నట్టిశాంతి గల్గెనో యన్నట్టు లశోకవృక్షము దన్నొక స్త్రీ దన్నఁగా ('అశోక శ్చరణాహత్యా' యని యుండుటచే) నప్పుడు పుష్పించి పచ్చనిపుప్పొడి చేత నాయింతికిఁ గనకాభిషేకము చేసినట్లుండెనని భావము.

67. చంపకదోహదము:—ఒక స్త్రీ ముఖ మెత్తఁగా 'ముఖరాగేణ చమ్పక' యని యున్నదిగాన, దానిముఖచంద్రరాగమువలనఁ బుట్టినసంపెఁగమొగ్గలలోనితేనియ చంద్రసుధవలెనే తియ్యగా నుండు నని తుమ్మెదలు రాఁగా, సంపెఁగచెట్టునందుఁ బుట్టుటచేఁ బూర్వవిరుద్ధగుణమే గల్గి పువ్వులు కూడఁ దుమ్మెదలను బాఱఁదోలెను. కాన బిడ్డలకుఁ దల్లిగుణమే యుండు నని భావము.



చ. అలరెఁ బ్రియాళు వ్రూర్త్త ప్రియ ♦ మాట వసంతముఁ బాడ నప్పుడ
వ్వేలఁదిసపత్ని భక్తికిని ♦ వేల్పులు మెత్తురు గాన రాగము
న్బలమునఁ దన్నుఁ బాడఁగ వ ♦ సంతుఁడు దా దయఁజేసెఁగాక యా
యెలె నిజశక్తినా యనుచు ♦ నీపసకుం గోదవెట్టె నీసునన్. 68

తే. అధరసుధఁ బ్రాణిజతఁ బ్రాణి ♦ యగుచు మౌక్తి
కాండమాలిక నిడెను నా ♦ సాగ్రిమౌక్తి
కంబ యనఁ జాలునన లిచ్చె ♦ గతజరత్సు
మంపువావిలి మొగమూర్పు ♦ నింప నోర్తు. 69

చ. ఘన మగు నాకు రాలి తిల ♦ కం బతిరిక్తత నున్న నోర్తు లోఁ
గనికర మూని కన్నుఁగవఁ ♦ గాయజుఁ డిల్లడ యిడ్డతూపులే
యనువుగ నించెఁగాక మఱి ♦ యంటక ముట్టక యొక్కచేష్టలే
క నెగడెఁ జూడ్కి నంట యిది ♦ గల్లనఁగా నలరించెఁ జూపులన్. 70

---

68. ప్రేంకణంబుదోహదము:—ఒకనాతి వసంతరాగము పాడఁగా 'గీత్యా ప్రియాళు ర్నితరా'మని యుండుటచేఁ బ్రేంకణము పూచెను. అపుడు దానిసవతి మెచ్చుకొనక యీసుచేత వేల్పులు భక్తికి మెత్తురు గావున వసంత మనియెడు తనపేరు గలరాగముచేతఁ దన్నుఁ బాడఁగా నావసంతదైవమే యీచెట్టును బుష్పింపఁజేసెనుగాని పుష్పించునట్లు పాటపాడునంతసామర్థ్య మీయమకుఁ గూడ నున్నదా!'' యని తిరస్కరించె నని భావము.

69. వావిలిదోహదము:—ఒకనెలఁత నిట్టూర్పు నింపఁగా ('సిందువారో ముఖానిలా' త్తనియుండుటచే) నట్టినిట్టూర్పువలనఁ బువ్వులు రాలిపోయినవావిలిచెట్టునందుఁ గ్రొత్తగా శ్రేణికట్టి మొగ్గలు గనిపించెను. అట్లు చాలుగా మొగ్గలు గనిపించుట స్త్రీయొక్క నాసాభూషణ మైనమౌక్తికము శ్రేణిగా గ్రుడ్లు పెట్టెనో యన్నట్లుండెను. అధరమందలియమృతస్పర్శముచేతను, ప్రాణము గలముత్తెపుఁజిప్పలోఁ దాను బుట్టియుండుకారణముచేతను, దానును బ్రాణము గలదై స్త్రీయొక్క నాసాభూషణ మైనమౌక్తికము గ్రుడ్లు పెట్టుటకు సామర్థ్యము వహించియుండె నని వర్ణింపఁబడియె.

70. తిలకవృక్షదోహదము:—'తిలకో వీక్షణేన చ' యనియుండుటచే బొట్టుగుచెట్టు నంటక ముట్టక తనచూపులచేతనే యొక స్త్రీ పుష్పింపఁజేసెను. ఈపద్యమునందలి దోహదమే 34వపద్యమునం దెట్లు వర్ణింపఁబడెనో గ్రహింపనగు.

తే. సాంద్రమకరందవృష్టి ర ♦ సాతలంబుఁ
దొరఁగుపువ్వుల ధూళియుఁ బూ ♦ దూలి నభము
నీక్రమమ్మయి మాధవుఁ ♦ డాక్రమించె
సురవిరోచనజనితమ ♦ హోష్మ మడఁగ. 71

క. ఊడుకొనఁ బడుమధూళిక
యోడికలకుఁ గ్రిందఁ గ్రిమ్మి ♦ యుండెడు తేంట్లన్
నీడలు దిరిగియుఁ దిరుగని
జాడఁ దరు ల్వ్రాలిచె నవ్వ ♦ సంతము వేళన్. 72

చ. శతదళమంజరీధవళ ♦ చైత్రనిశామలచంద్రికౌఘము
ల్వృతవియదంతకేళివన ♦ వృక్షలతాంతరజశ్ఛటం గలం
కితఁ గని కామినీకమన ♦ కేళియుఁ బోఁజెడవా నగాటవీ
కతకపరాగ మొక్కదెసఁ ♦ గ్రమ్మి యనచ్ఛత మాన్ప కుండినన్. 73

సీ. శైత్యపాండిమలు దు ♦ షారాంతమునఁ జేరె, నిరులుకొన్దాత్రిక్షపం ♦ దిరుల విరుల
వలయగానము లయి ♦ క్తలకార్శ్యమునఁ జేరె, మలయంపుఁగమ్మవీ ♦ వలఱల నలుల
సౌరభోల్లాసము ♦ ల్జాతి గ్రుంగఁగఁ జేరె, నలరారుకొదమక్రో ♦ వులను నెలను
స్ఫుటజటామస్కరం ♦ బులు ప్రతిమ్యతిఁ జేరె, నందనప్లక్షసం ♦ తతుల వృతుల
స్వభృతపరభృతవినుతర ♦ సాలపరిష, దహరహగ్లిక్ష్ప్తబహురహగి ♦ ప్రహరవిహార
మాణమానవతీపరి ♦ మ్లానిమాని, వారివారిజవనగంధ ♦ వాహ మొలసె. 74

ఉ. సారెకుఁ గీరము ల్పలర ♦ సాలముశాఖలలోనఁ దిమ్మరం
గా రహిఁ దన్మధూళికకుఁ ♦ గా నళిపంక్తులు వెంటఁ గ్రిమ్మరం

---

71. ప్రకృతవసంతవర్ణనముచేత నప్రకృతత్రివిక్రమపరిస్ఫూర్తి గలుగుటవలన నీపద్యమందలియలంకారము సమాసోక్తి.

73. చిల్లపాడి బురదనీటిలో రాల్చిన నీరు తేఱుట ప్రసిద్ధ మగుటచే నావిషయ మిందు వర్ణింపఁబడియె.

74. ఈపద్యమందుఁ బర్యాయాలంకారము. పర్యాయలక్షణము—ఒకవస్తువు క్రమముగా ననేకాధారంబులను బొందుటను వర్ణించుట.

75. చిల్కరొదలవర్ణనము.— తియ్యమామిడిచెట్టుకొమ్మలలోఁ దిరుగు చున్న చిలుకలవెంబడిఁ దుమ్మెదలు మెదలఁగా, నవి సరపణులవలె నుండెఁ గావున వనలక్ష్మియుఁ



గా రొద మించె నందుఁ జిలు ♦ క ల్వనలక్ష్మియుఁ దద్వచస్సుధాం
ధోరుచు లానఁగా సరప ♦ ణు ల్జనుల ట్లిడి పెంపఁగాఁబలెన్. 75

సీ. ప్రతిహంత్రుతాత్తకీ ♦ టత చన్న భృంగసం, ఘపుటంగములచేతఁ ♦ గాయ మెత్తి
యమదిశాగతమరు ♦ త్ప్రాణి రై తదళిరం, గస్థలాబ్జినిఁ దమ్మి ♦ కన్ను దెఱచి
ప్రాంతఫుల్లామ్రసం ♦ శ్రయితచ్ఛటాహతా, ద్గతి లేచి చెలిఁ జైత్రుఁ ♦ గౌఁగిలించి
యురుపరాగపుశాటి ♦ నుద్దండవాప్యుత్ప, లస్రవత్సీధుర ♦ త్యసి ముడిపి
క్రమ్మఱఁ బలాశకటకాము ♦ ఖమునఁ గీర, చలితశాఖాస్ఫుటాశోక ♦ శరముఁ గూర్చెఁ
దద్రతికిఁగాఁగఁ జలికాలఁ ♦ దన్ని మంచు, పాండురాంగుండు విడిచి పో ♦ బ్రదికి మరుఁడు.

సీ. సహకారఫలరస ♦ సౌరభ్యములఁ గూడి, మాధ్వి మోవులఁ గదం ♦ బముగ వలవ
మలయజోదరత జం ♦ భలఫలత్వగ్గత, శ్రీ మించుచెవుల గో ♦ జ్జఁగలు మెఱయ
శశికదళోదర ♦ చ్ఛదపుఁబావడ లూరు, చకచకఁ బట్టి పా ♦ లికిఁ బెనంగఁ
ద్రొక్కుతేంట్లకుఁ గాఁక ♦ లెక్కింపఁ జెరివిన, గంధఫలీపంక్తిఁ ♦ గబరు లలరఁ
గేలఁ గలవంటకపుఁదావికిని బులిమిన, ఘుసృణములు మించ ననలఁ బే ♦ రెనఁగెడువన
ములు నమేరురజోవృష్టిఁ ♦ బూదిఁ జఱవఁ, బడఁతు లలరిరి పొదరిండ్లఁ ♦ బతులతోడ. 77

## * స్వారోచిషమనుసంభవము, ఆశ్వాసము. ౬.

(పారుఁ డనం బరఁగుబ్రహ్మర్షి యతిఘోరతపం బాచరించుచుండ నాఖం

---

జిల్కపల్కుల విని యలరుటకై మనుష్యులవలెనే చిలుకలకు గొలుసులు వేసి పెంచు నట్లుండఁగా నట్టిచిలుకలు రొదసేసెను.

76. కటకాముఖ మనునట్టియభినయహస్తవిశేషలక్షణము.—జుట్టనవడిమివ్రేల్లనం దున బొటనవ్రేలు చొప్పించి యఱచేతిచాయ వ్రాల్చి యుంగరపువ్రేలిని జిటికెనవ్రేలిని నించుకంత వంచి పొడవుగాఁ బట్టినయది. ఈహస్తమును బువ్వులు కోయుట, బాణములను మెల్లగా నీడ్చుట, విడియ మిచ్చుట, మొద లగువానియందుఁ బ్రయోగింపవలయును.

* స్వారోచిషమనుసంభవమును రచియించినవాఁ డల్లసాని పెద్దన. నందవరీక బ్రాహ్మణుఁడు. బళ్లారిప్రాంతమునం దున్నదూపాడుపరగణాలోనిదొరాల గ్రామ మీతని జన్మస్థానము. కృష్ణదేవరాయలయాస్థానకవీశ్వరుల కెల్ల శిరోమణి యైనవాఁడు. ఈయనకుఁ బూర్వమునం దున్నకవులు పురాణేతిహాసాదుల నాంధ్రీకరించిరి గాని యెవ్వరును స్వకల్పనములను మిక్కిలియెక్కువగాఁ జేర్చి ప్రబంధములుగా రచియింప రైరి. ఈ

డలుండు జడిసి తత్తపోవిఘ్నంబునకుం బుంజికస్థల యనునచ్చర
మచ్చెకంటిం బుచ్చిన నాలలనయు మునిపాలి కరుదెంచుటయు.) †

చ. అను వగునుల్ల సొప్పుమల ♦ యానిలవాహము నెక్కి తేంట్ల న
ల్లినవనిడువాగెఁ బూని లవ ♦ లీనవవల్లిక లెమ్మెసొమ్ములై
పనుపడఁ జెట్లు పట్టి మను ♦ ప్రాంతదళమ్ములతోడఁ దోలె నా
మనిదొర మంచురాజు మడి ♦ మంచగఁ గోయిలగంట మ్రోయఁగన్. 78

సీ. సానదేఱి పాటమరించి సెలవాసినయట్టి, యాకురాలుపుగండ్ల ♦ యందుఁ దొరఁగి
యతిబాలకీరచ్ఛ ♦ దాంకురాకృతిఁ బొల్చి, కరవీరకోరక ♦ గతిఁ గ్రమమున
నరుణంపుమొగ్గలై ♦ యరవిచ్చి పికిలియై, కలదండలట్లు గుం ♦ పులయి పిదప
రేఖ లేర్పడక వ ♦ ర్ధిలి వెడల్పయి రెమ్మ, పసరువాఱుచు నిక్కఁ ♦ బసరుకప్పు
పూఁటపూఁటకు నెక్కఁగ ♦ ప్పునకుఁ దగిన, మెఱుఁగు నానాఁటికిని మీఁద ♦ గిఱికొనంగ
సోగ లై యాకు వ్రాలంగ ♦ జొంప మగుచుఁ, జిగురు దళుకొత్తెఁ దరులతా ♦ శ్రేణులందు. 79

క. హిందోళంబునఁ బాడిరి
బృందారకసతులు విరహి ♦ బృందార్తిగఁ దేఁ
చెం దేఁటులు వాసంతిక
విందునఁ బికశిశువు దాది ♦ వెడలం దోలెన్. 80

సీ. చలిగాలి బొందుమ ♦ ల్లెల పరాగము రేఁచి, నిబిడంబుసేసె వె ♦ న్నెలరసంబు
వెన్నెలరస ముబ్బి ♦ వెడలించె దీర్ఘికా, మందసౌగంధిక ♦ మధునదంబు
మధునదం బెగఁబోసె ♦ మాకందమాలికా, క్రీడానుషంగిభృం ♦ గీరవంబు
భృంగీరవం బహం ♦ కృతిఁ దీఁగ సాగించెఁ, బ్రోషితభర్తృకా ♦ రోదనముల

---

కవియే మొదల మార్కండేయపురాణములోని మనుసంభవకథను స్వకపోలకల్పనలచేఁ బెంచి స్వారోచిషమనుసంభవ (మనుచరిత్ర) మను పేరఁ బ్రబంధరూపమున రచియించుటం జేసి యీతని కాంధ్రకవితాపితామహుఁ డని బిరుదు గల్గినయది. ఇతఁడు హూణ శకము 1535వ సంవత్సరముదాఁక జీవించి యుండినట్లు తెలియవచ్చుచున్నది.

† నృసింహపురాణమునందును నిట్టిసందర్భముననే వసంతర్తువు వర్ణింపఁబడి యున్నది.

81. ప్రోషితభర్తృకాలక్షణము:— కాంతుఁడు దేశాంతరగతుఁడు కాఁగా ఖిన్నురాలైన స్త్రీ. (దేశాంతరగతే కాన్తే ఖిన్నా ప్రోషితభర్తృకా.)



విపినవీథుల నేతెంచెఁ ♦ గుపితమదన, సమదభుజనతసుమధను ♦ ష్టంకృతములు
సరసమధుపాన సమ్మదో ♦ త్సవవిలీన, యువతియువకోటికోరిక ♦ ల్సివురులొత్త. 81

## * కవికర్ణరసాయనము, ఆశ్వాసము. ౪.

(మాంధాతృనామకభూమీశుండు కుంతలపతిదుహితం జంచరీకచంచ
త్కుంతలసహిత న్విమలాంగి యనులతాంగిం జెట్టపట్టి వివిధవిహా
రోద్దేశంబుల ఖేలనంబులం దెప్పలుదేలుచుండె నంత.)

ఉ. భాసురలీల నయ్యె నిల ♦ పై మధుమాసము గర్వితేక్షుబా
ణాసకృతాట్టహాసము భ ♦ యాకులపాంథవిముక్తదీర్ఘని
శ్వాసము కోపనాధృతివి ♦ నాశము కోకిలకీరషట్పదో
ల్లాసము దత్తభూరుహవి ♦ లాసము సర్వమనోవికాస మై. 82

ఉ. ప్రాయము భూరుహంబుల క ♦ పాయము మంచున కాపతత్ప్రవి
ప్రాయము పాంథకోటికి ను ♦ పాయము చిల్కలకు న్సమాపనా
ధ్యాయము కోపనాధృతికి ♦ దాయము చల్లనిగాలి కెన్నఁగా
నాయము పుష్పబాణునకు ♦ నామని నే మని ప్రస్తుతింపఁగన్. 83

చ. తెగినమనోభవుం దిరుగఁ ♦ దెచ్చి కుజంబుల కెల్లఁ బ్రాయము
ల్మగుడఁగ నిచ్చి యన్యభృత ♦ మండలిమూఁగతనంబు వుచ్చి ము
జ్జగముల వార్త కెక్కినవ ♦ సంతభిషగ్వరుఁ డాప్తుఁ డయ్యునుం
దగుగతి మాన్ప లేఁడ మఱి ♦ దక్షిణవాయువునందు జాడ్యమున్. 84

క. తొలఁగి చిరకాలమునకుం
గలసినమాధవునిమీఁదఁ ♦ గనలి వనశ్రీ
తలిరుల నెఱ్ఱంబాఱుచుఁ
గలకంఠప్రథమవాక్య ♦ గతులన్ గొణఁగెన్. 85

---

* కవికర్ణరసాయనము సంకుసాలనరసింహకవిచే రచియింపఁ బడినది. ఈకవి కృష్ణదేవరాయలకాలమం దున్నట్లు తెలియవచ్చెడిని. కృష్ణదేవరాయలు హూణశకము 1484వ సంవత్సరము మొదలు 1530వ సంవత్సరముదాఁక నుండినట్లు ప్రసిద్ధి.

84. ఈపద్యమందలివిషయములు కొన్ని 28 వ పద్యంబున నెట్లు వర్ణింపఁబడెనో లక్షించునది.

ఉ. అనమయంబున న్మధున ♦ మాగతలక్ష్మి వనప్రవేశముం
జేసినవేళఁ జూడఁ బోలి ♦ చెం చికషట్పదభూతతృప్తిగాఁ
బోసినమాంసపుంజముల ♦ పోలికఁ బల్లవితామ్రసంచయం
బాసవపాత్రి లయ్యె వకు ♦ ళాగ్రిదళస్మకుళప్రతానముల్. 86

ఉ. పొన్నలు నవ్వెఁ గ్రొన్ననలఁ ♦ బువ్వరసంబునఁ గేసరంబు లు
త్పన్నజుగుప్సమై నుమిసెఁ ♦ బాటలము ల్గనుమోదయంబుచే
గ న్నెఱ చేసెఁ దిట్టెఁ గల ♦ కంఠగుతంబులఁ జాతము ల్వృథా
మున్నుగ నన్నిటిం గడచి ♦ మోదుగు పువ్వుల విఱ్ఱవీఁగినన్. 87

చ. చిగురులచేతఁ గోయిలలఁ ♦ జిత్రిఫలంబులచేతఁ జిల్కలం
దగుపువుఁదేనెచే నలులఁ ♦ దావులచే మలయానిలంబులన్
మొగడలచేఁ బ్రసూనశరు ♦ మోదితుఁ జేసి యభీష్టదంబు లై
పొగడిత కెక్కెఁ గల్పకముఁ ♦ బోలె రసాలకుజంబు లామనిన్. 88

సీ. వివిధవనీరమా ♦ విమల సాంద్రికటాక్ష, వీక్షాపరంపరా ♦ విలసనములు
మలయమారుతచర ♦ న్మత్తేభచరణావ, లంబితాయతశృంఖ ♦ లాలతికలు
పథికజనావలీ ♦ ప్రతిసమాకర్షణ, ప్రద్యుమ్నముక్తదోగి ♦ ప్రగ్రహములు
మధుజగన్మోహన ♦ మంత్రవాదికరాజ్జ, వలమానవలినాక్ష ♦ వలయితములు
ప్రథమకౌమారనవపరి ♦ పాకకలన, వికసదభిమతతరులతా ♦ గ్రికరమంజు
మంజరీమధుమధురిమా ♦ స్వాద మెనఁగ, మెలఁగె బహువిధగతులఁదు ♦ మ్మెదలగములు. 89

క. ముమ్మరవుందేనెలజడి
చెమ్మల వనవీథు లెల్లఁ ♦ జె న్నగుటఁ జామీ
కమ్మవిరితావిమోపరి
తెమ్మెర లొయ్యొయ్య వెఱచి ♦ తిరుగుట లెల్లన్. 90

చ. చలువలపుట్టినిండ్లు నవ ♦ సౌరభలక్ష్ముల కంతరంగముల్
మెలపులకు న్నివాసములు ♦ మెచ్చులచేగుగడ ల్విరక్తతా

89. ఈపద్యమందుఁ గలతుమ్మెదలవర్ణనమునకును 54వపద్యంబునందలివర్ణనమునకుం బోలిక చూచునది.



కలనల కెత్తుకోళ్లు తమ ♦ కంబులకుం గయిదండ లామనిన్
మలయుచు వచ్చె గంధగిరి ♦ మంథరబంధురగంధవాహముల్. 91

సీ. రేలవెన్నెలలు పం ♦ డ్రెండుసూర్యులు సూపు, పేరెండ లై కాసి ♦ నీరసింప
దక్షిణానిలము లు ♦ ద్ధతి నేసుడొఱఁగులఁ, బెరిఁగెడుగాడ్పు లై ♦ పెల్లగింపఁ
గెంజాయ దిక్కులఁ ♦ బింజించుచిగురులు, కాలానలార్చు లై ♦ కాఁకఁ బెనుప
నలికుకఫికగర్జ ♦ లడరఁ బూఁదేనియ, ఘోరాంత్యవృష్టి యై ♦ కురిసి కలఁప
తే. విరహవేదన లెసఁగి యు ♦ ద్వేలగతుల, నద్భుతముగ నేకార్ణవ ♦ మగుచు ముంప
నఖిలసుఖకారి యగువసం ♦ తాగమంబు, పథికలోకంబునకు మహా ♦ ప్రళయమయ్యె.

ఉ. పూచినపువ్వు లెల్ల సుతిఁ ♦ బొంద మనోభవునంపకోల లై
వీచినగాడ్పు లెల్లఁ బొది ♦ వెళ్ల మలయాచలమారుతంబు లై
రేచినపల్కు లెల్లఁ దగి ♦ రెం చికభృంగఘుకస్వరంబు లై
చూచినరూప మెల్ల మద ♦ చుంబిత మై విలసిల్లె నామనిన్. 93

చ. ప్రసవశరప్రతాపశిఖిఁ ♦ బర్వఁగఁ జేయుటచే నిదాఘు మై
కుసుమరసాతివర్షమున ♦ కుం గుదు రొటఁ బయోదకాల మై
రసికమనోంబుజంబు లల ♦ రంగ శరత్తయి తాన శైశిరో
ల్లసనముఁ జూపి పాంథసతు ♦ లన్ వడఁకించె వసంత మత్తతిన్. 94

సకలకథాసారసంగ్రహము ౘ
తృతీయాశ్వాసము.

(నిషధదేశం బేలువీరసేనునికుమారుండు నలుం డనువాఁడు విదర్భేశ్వరుఁ డగుభీమభూమీశుతనయ యైనదమయంతిరూపరేఖావిశేషంబుఁ బొఱుల

92. పండ్రెండుసూర్యులు:—మహద్విశేషణసంఖ్యావాచకంబులకుఁ గొన్నియెడల నమహత్కార్యంబు చూపట్టెడి. ఉ. సమిద్ధమతులు యతులు పదివేలు, భార. అర, 5 ఆ. సీ. మూఁడర్బుదములు సముద్యద్భుజాటోపవిజయధౌరేయులు వీరభటులు, జైమిని భార, 5 ఆ.

94 – 18వ 26వ 30వ పద్యములలోనివర్ణనమును జూచునది. అందు వర్షర్తువుగా మాత్ర వర్ణింపఁబడియె, ఇందుఁ బెక్కుఋతువులుగా వర్ణింపఁబడియున్నది. ఇది విశేషము.

ౘ సకలకథాసారసంగ్రహమును రచియించినకవి యయ్యలరాజు రామభద్రుఁడు. ఇందు షట్చక్రవర్తులు లోనగువారిచరిత్రము తొమ్మిదియాశ్వాసములుగా వ్రాయంబడి

వలన విని, వలపుగొనుచుండి, యొక్కనాఁ డుపవనంబునకుం జని, యందు విహరించుచుఁ దనచేతఁ బట్టువడినరాయంచచే దమయంతివృత్తాంతం బెంతయు నాలించి, నిన్ను దమయంతి వలచునట్లుగ నొనరించెద నని నుడివిన యా రాజహంసంబును విడిచిపుచ్చె. అమ్మానసౌకంబు నాకసంబునఁ గుండినగరంబున కరిగి యం దుద్యానంబున దమయంతి రాక నిరీక్షించుచుండె. ఇట నలుండు నిజనివాసంబునకుం జని కామాకులచిత్తుం డై చక్రాంగాగమనంబు గోరుచుండె నంత.)

సీ. భావజసామ్రాజ్య ♦ భవ్యనివాసంబు, శుకపికధ్వానసం ♦ శోభితంబు
వనరమాసౌందర్య ♦ వైభవసమయంబు, గురుతరజాతికా ♦ కుంతనంబు
యువతియువప్రియో ♦ త్సవసన్నివేశంబు, పరిమళోత్కీర్ణది ♦ గ్భాసురంబు
మధుపానమోహిత ♦ మధుకరనికరంబు, వివిధభోగానంద ♦ విశ్రుతంబు
తే. లలితపల్లవితసుమిత♦ఫలితవిలసి, తద్రుమంబు ద్విజోత్సవ ♦ దాయకంబు
ఘనతరోత్సాహమాధవా ♦ గమనకాల, మనఁగ విలసిల్లె ధర వనం♦తాగమంబు. 95

తే. ఘనతరారామలక్ష్మి స ♦ త్కౌశలమున
రమణుఁ డేతెంచు నని రత్న ♦ రంగవల్లు
లొనరఁ దీర్చె ననంగను ♦ ననిలహతిని
రాలి విలసిల్లె జీర్ణప ♦ ర్ణవ్రజంబు. 96

చ. ధవునిసమాగంబునను ♦ దార తదిష్టవశాప్తిఁ బూని చి
త్రవితతభూషణాళులను ♦ దాల్చి వెసం జిగిరించె నట్ల మా
ధవునిసమాగమంబున ను ♦ దారత దిష్టవశాప్తిఁ బూని చి
త్రవితతభూషణాళులను ♦ దాల్చి వెసం జిగిరించె వృక్షముల్. 97

చ. సవినయరీతిఁ బుష్పవతి ♦ చాల విశుద్ధతఁ బూని వేడ్కఁ ద
ద్ధవు హితబుద్ధిఁ గూడి వెసఁ ♦ దత్ఫల మున్నతిఁ దాల్చినట్లు దా

---

యున్నది. దీని నీకవి బాల్యంబున రచియించుటంజేసి యిందలికవిత్వ మప్రౌఢ మై లక్షణవంతము గాక యుండును. ఇతఁడు వ్రాసిన తక్కినగ్రంథములు వీరరాఘవుమీఁద నొక శతకమును రామాభ్యుదయమును. ఇతనివాసస్థలము కడపమండలములోని యొంటిమెట్ట. ఇతఁడు హూణశకము 1520వసంవత్సరము మొదలుకొని యున్నట్టు ప్రసిద్ధి.

97, 98, 99 – ఈమూఁడుపద్యములలో యమక మున్నదిగాని యర్థపుష్టి యంతగా లేదు.



నవినయరీతిఁ బుష్పవతి ♦ యై పరిశుద్ధతఁ బూని వేడ్కమా
ధవు హితబుద్ధిఁ గూడి వెసఁ ♦ దత్ఫల మున్నతిఁ దాల్చె వృక్షముల్. 98

ఉ. మాధవుశాసనంబునను ♦ మా ద్విజముఖ్యఫలప్రదాత్రి యై
దా ధరణిం జెలంగుగతిఁ ♦ దద్వనీరమ యొప్పి యప్పు డా
మాధవునాజ్ఞ సద్ద్విజస ♦ మాజమునందు ఫలప్రదాత్రి యై
దా ధరణిం జెలంగెను సు ♦ ధారససత్ఫలవృక్షరాజి యై. 99

## రామాభ్యుదయము *

### ప్రథమాశ్వాసము.

(అయోధ్యాపురి కధీశ్వరుం డయినపంక్తిరథుండు త్రిశక్తులుంబోని కౌసల్యాకైకేయీసుమిత్రలం బెండ్లియాడి యమందానందంబునం బొందిపూజ్యం బగు రాజ్యంబు సేయుచుండె నట్టియెడ.)

మ. జనితాశేషవియోగవహ్నిచయని ♦ శ్వాసంబు సంసూచితా
వనిజోదగ్రవిలాసమత్తమధుప ♦ వ్రాతక్షుధాయాన మా
ర్తినితాంతాకులకీరకోకిలకులా ♦ ర్తిస్తోమసుగాత్రస మిం
పొనరించె న్మధుమాన మష్టకకుబం ♦ తోల్లాస మై యయ్యెడన్. 100

తే. కాలకంఠసమిద్ధన ♦ ఖ్యంబు మెఱయ
నతులతరవైఖరి సుపర్ణ ♦ గతులు దొరయ
నలశుకాదుల కక్షయ ♦ ఫలదుఁ డగుచుఁ
జేరె మాధవుఁ డుపవన ♦ శ్రీఁ దలిర్ప. 101

తే. మాధవవరప్రసాదసా ♦ మగ్రివలన
యామ్యదిక్కాంత నికటవ ♦ నాగజీర్ణ
పత్రచిత్రపరిష్కార ♦ పటలి నడలి
యనిలడింభకగర్భిణి ♦ యగుట దెలిపె. 102

సీ. దక్షిణాశావధూ ♦ తనయుఁ డై వనలక్ష్మి, పెంపునఁ బొదరిండ్లఁ ♦ బెరిఁగి పెరిఁగి
తేఁటిజోటులజోల ♦ పాటలఁ బాటిల్లి, తీగెయుయ్యాలలఁ ♦ దూఁగి తూఁగి
కమలాకరంబులఁ ♦ గమ్మపూఁదేనియ, యానుచుఁ జల్లుపో ♦ రాడి యాడి
కమలధూళీపాళి ♦ కాకేళికలఁ బొల్చి, మందమందవిహార ♦ మొంది యొంది

---

* రామాభ్యుదయమును రచియించినవాఁ డయ్యలరాజు రామభద్రకవి. 25వపుటలోనిటిప్పణి చూచునది.

తే. యోగమస్థితి యెఱిఁగి బా ♦ ల్యంబుతఱిని, మల్లులఁ బేనంగి పాంథుల ♦ మర్మ మెఱిఁగి
సాము సేయుచు మాధవ ♦ స్వామియాజ్ఞఁ, గంతుజోదై మెలంగు లే ♦ గాడ్పుఁగుజ్జి.

క. బలుమంచుమించుదొర వ్రా
నలయరుణాంశువులు పర్వ ♦ నాకృతి తోఁచెం
జలితత్రి చనుతఱిఁ దరువులఁ
దలిరులజొంపములకెంపు ♦ ధగధగ లెసఁగన్. 104

చ. అలరె వనీవధూటి మధుఁ ♦ డన్ పతిఁ జేరి తుషారబాష్పధా
ర లుడిపి పద్మరాగహారి ♦ రత్నవిభూషణముల్ ధరించుబా
గొలయఁగఁ బల్లవాళికల ♦ యోగమునం గడు నుల్లసిల్లును
త్కళికల మించె హర్షపుల ♦ కంబులు దాల్చినభాతి నంతటన్. 105

సీ. భూరికాంతారకే ♦ దారముల్ సమకట్టి, కోడెగాడ్పుల జంట ♦ గూడఁ గట్టి
పెలుచఁ గారాకుఁబె ♦ ల్లలు పెల్లగిల దున్ని, తలిరాకుడాలునీ ♦ రలవరించి
కళికాంకురంబుల ♦ మొలకనారులు నాఁటి, వెలిగ జాదులసొంపుఁ ♦ గలుపు దిగిచి
కాపుగా సుకుమార ♦ కలకంఠి నియమించి, యాయాతరులఁ బోది ♦ సేయనేర్చి

తే. నమ్మిక వసంతుఁ డనుపేరి ♦ కమ్మతీఁడు, నెఱయ నెల్లెడ వలరాజు ♦ కఱవు దీఱ
నౌర యామని వచ్చె నా♦హా యటంచు, జగము దనియంగఁ బుష్పమం♦జరులు పండె.

తే. అలవసంతధరాకాంతుఁ ♦ డరుగుదేర
రాచిలుకచాలుఁబచ్చతో ♦ రణము లమర
సాంద్రగతిఁ గట్టుమేల్కట్టు ♦ చెంద్రకావి
యంశుకంబులు నాఁ బూచెఁ ♦ గింశుకములు. 107

క. తలఁప నుదాహరణాకృతిఁ
గళికల రంజిల్లి సరస ♦ కవికావ్యమునుం
బలె నెడల మత్తకోకిల
కలన న్మధువేళ వనని ♦ కాయం బలరెన్. 108

క. తరుణీమానమదాంధ
ద్విరదమణీఘృణులు విరహి ♦ దేహస్రవహ
స్మరదైత్యదంష్ట్రిలును నన
నరుణాంశుకకింశుకంబు ♦ లామని నమరెన్. 109

109. ఇందలివర్ణనమునకును 9వపద్యములోనివర్ణనమునకును గలభేదమును గనుం గొనునది.



ఉ. ఆక్రమ మొప్పఁ జైత్రుఁడు మ ♦ దాళిమదావళపంక్తి మీఱ హే
తిక్రియ నూత్నపల్లవత ♦ తిన్ ధరియించి యుదగ్రవైఖరిన్
విక్రమ శాలు లైనతరు ♦ వీరులపాఁజులు దీర్చి పాంథజై
త్రక్రమయాత్ర పూనె వల ♦ రాయనికిన్ దళవాయిచంద మై. 110

కృష్ణరాయవిజయము ❁

చతుర్థాశ్వాసము.

(కృష్ణదేవరాయఁడు దిగ్విజయంబు సేయ వెడలి, యనేకరాజుల జయించి, వారివలనఁ గానికలం గైకొనుచుఁ దుదకు నుదయపురిం జేరి, తత్పురాధిపతి యగుగజపతి నోడించి, తన్ను శరణు వేఁడిన నాతని రక్షించె. అంత గజపతి, కృష్ణరాయనిమంత్రి యైనయప్పాజిం బిలుచుకొనిపోయి, తనతన యం గృష్ణరాయండు పెండ్లియాడవలయు నను నెన్నికతో నంతకుమున్న నిజాజ్ఞమైఁ జెలికత్తెలు దివ్యాలంకారభూషితం జేసి తోడ్కొనివచ్చియున్న యన్నాతి నాతనికిం గాన్పించి, యాయమ వెంచినచిల్క నాతని కర్పించి, యాచిలుకం జూపి, యిది చదువరి రాయలయెదురఁ దనసౌందర్యాతిశయంబు వర్ణింపుమనిమదీయపుత్త్రిక యనుపఁగా వచ్చినయది యని నుడివి, పెక్కులు పసదనంబు లొసంగి, వీడ్కొలిపె. అప్పాజియుఁ జిలుకం గొంపోయి యియ్యది గజపతిసుతను వర్ణింప నెఱుంగు నని కృష్ణరాయని కొసంగ, నాతండు దానిఁ బ్రీతిమైఁ గైకొనుడు నక్కీరం బిట్లనియె, నా పేరు మోహనవాణి, పాలవెల్లిలోని వెన్నునిపూఁదోఁటలో మాకొలముసాము లుందురు. ఆజగన్నాయకుం డిల నవతరించుటం జేసి యప్పుడు మాతల్లిదండ్రులు స్వామిదర్శనార్థమై వచ్చి యిట శాశ్వతముగా నిల్చిరి. ఏను నత్తఱిం బ్రబలుచుఁ, జిన్ననాఁటన గజపతిసుత చిలుకలం జక్కఁగాఁ బోషించు నని యాలించి, యాయమచే గారవంబువడయ నెంచి, యారమణీమణి తానే నన్నుఁ జూడవలయు నని తలంచి, కేళీవనులకుం జని క్రుమ్మరుచుంటి.)

ఉ. అంత వసంత మెంతయుఁ ద ♦ నంత ననంతఘనాంతకాంతవ
న్యాంతికదంతురీభవద ♦ నంతలతాంతనితాంతకాంత మ

❁ కృష్ణరాజవిజయము వేంకటార్యుఁ డనునామాంతరంబు గలకుమారధూర్జటిచే రచియింపఁబడినది. ఈకుమారధూర్జటి శ్రీకాళహస్తిమాహాత్మ్య శ్రీకాళహస్తీశ్వరశతకములను

త్యంతశకుంతసంతతివిహ్వ ♦ దంతరసంతతచింతితార్థభా
స్వంతము పొల్చె నా విరహ ♦ వంతుల కెంతయు వింతవింతగన్. 111

సీ. తొలుదొల్తఁ బండుటా ♦ కులు రాలె మహిమీఁద, విలసిల్లె మలయాద్రి ♦ మలయునీఁద
ఱెక్కొక్కకెందలి ♦ రుదయించెఁ జరురాజిఁ, దోర మై తనరెఁ గం ♦ తుని నరాజి
చెలఁగె దిక్తటులఁ గో ♦ యిలరావములసౌరు, మొదలాడె గండుఁదు ♦ మ్మెదలబారు
రహిమీఱె నపుడుమ ♦ రందధారలచిన్నె, పొలుపొందె మెఱుఁగుఁబు ♦ ప్పొడులవన్నె
తే. పొన్నగున్నలు సురపొన్న ♦ లన్నువ లగు, క్రొన్ననలచెన్నులలరిన ♦ విన్నసెనఁగె
నెన్న నన్నన్న యీచైత్ర ♦ మెంతవింత, సంతస మొనర్చె రమ్య మై ♦ జనుల కెల్ల.

ఉ. సారెకుసారెకుం గుసుమ ♦ సాయకుఁ డధ్వగరాజిగుండియల్
దూఱఁగ వేగ చే వెసల ♦ దూసి వెసన్ జళిపించురక్తసి
క్తారుణనూతనాయుధము ♦ లై మలయానిలమందమందసం
చారచలాగ్రమతేరు ♦ జాలములన్ మెఱసెం గిసాలముల్. 113

ఉ. మత్తిలి వీర లియ్యెడల ♦ మమ్ము గణింపక మానినీమనో
విత్తములన్ హరించెదరు ♦ వేగమె పాంథులు శిక్షసేయుమే
యిత్తఱి నంచుఁ జిత్తజుని ♦ భృత్యులు దత్తఱపాటు మీఱఁగా
నెత్తినబెత్తులట్ల తగె ♦ నెంతయుఁ జక్కనిపూవుఁదీవియల్. 114

సీ. వేళానతీపదా ♦ న్వితలాక్ష గగనల, క్ష్మీకుచద్వయకుంకు ♦ మాకలనము
ధరకదంబకనము ♦ త్కటనూనరాజి ది, శాంగనాశోణప ♦ ట్టాంబరాళి
ముగ్ధభిల్లీగళ ♦ స్నిగ్ధగుంజాఫల, ప్రతతి యధ్వగమధు ♦ వ్రతవినూత్న
చాంపేయతతి సుమా ♦ స్త్రస్యందనారుణ, దీప్తిమద్వ్యజయం ♦ తీవితాన

---

రచియించినధూర్జటికిఁ బౌత్రుఁడు. ఈతఁడు డాకుపీటిరా జైనచినవేంకటాద్రివేఁడికోలుమీఁద శ్రీరామాంకితముగా నీకృష్ణరాజవిజయం బొనరించె. ఈతనికవిత్వము రసవంత మై యుండును. సావిత్రీచరిత్ర, యిందుమతీవివాహము, లోనగుగ్రంథముల నితఁడు విరచించి యున్నాఁడు. ఈకవి హూణశకము 1560, 1570, సంవత్సరములదాఁక జీవించి యుండు నట్లు చెప్పుదురు.

115. ఈపద్యమునందుఁ జిగురాకు పెక్కుతెఱంగు లైనయొజ్జదాలువస్తువు లై యున్నట్లు వర్ణింపఁబడియుండుటచే నిది 46వపద్యములోనివర్ణనము ననుసరించి యున్నది.



తే. మఖితతరుమానిబృందజ ♦ టాంశుపటలి, మాధవార్పితవల్లికా ♦ మానినీవ
తంసమణిఘృణి తలిరాకు ♦ దనరె నపుడ, నంగవిక్రమవిస్ఫూర్తి ♦ నతిశయించి. 115

## రాఘవ పాండవీయము.

### ద్వితీయాశ్వాసము.

(రామాయణము:–దశరథునకు రామలక్ష్మణభరతశత్రుఘ్ను లుద్భవించి నానాఁటికి పొంగునట్టినవకంపుఁగళలపెంపుచేఁ జిన్నిక్రొన్నెలబోదలో యనం బొదలుచు శైవక్రీడలం దవిలి రాజిలుచుండిరి. భారతము:–పాండుభూపతికి ధర్మజభీమార్జుననకులసహదేవులు పుట్టి యంతకంతకు మించు వింతమగంటిమిం గంఠీరశాబకంబులో యనం దేజరిల్లుచు నెండొరులం గలసిమెలసి యుండిరి.)

ఉ. అంత వసంత మొప్పెఁ జర ♦ మాగ్రిమభాగచరాఖిలర్తుసా
మంత మనంతజాలకస ♦ మంజసరంజితకుంజకుంజరో
ద్ధ్వాంతనితాంతసాంద్రమధు ♦ దానవిజృంభితబంభరస్వ
నాత్యంతనిరంతరీకృతది ♦ గంత మతాంతలతాంతకుంత మై. 116

సీ. అచ్చంపులేఁజిగు ♦ రాకుజొంపముకెంపు, మేలిచెందిరపుఁగెం ♦ దూళి గాఁగ
గ్రుచ్చినట్లుగ జాదు ♦ క్రొన్నమొగ్గలగుంపు, ప్రకటపాటలబిందు ♦ పాళి గాఁగ
విచ్చినపరువంపు ♦ విరులతండము పెంపు, శోభితభూతిరిం ♦ ఛోళి గాఁగ
నిచ్చలం బైనతే ♦ నియవానజడిసొంపు, లాలితదానధా ♦ రాళి గాఁగ

---

* రాఘవపాండవీయమును రచియించినవాఁడు పింగళిసూరన్న. కృష్ణామండలములోని పింగళిగ్రామనామమునంజేసి యీవంశమువారి కెల్ల నిట్టిపేరు గలిగె. ఈసూరనార్యుని పూర్వులు మొదలఁ గృష్ణామండలములో నుండినవా రయ్యును దరువాత దక్షిణదేశమునకుఁ బోఁగాఁ గృష్ణదేవరాయనియనంతరమున విజయనగరరాజ్యము చెడి పెక్కండ్రు చిన్నచిన్నరాజులయధీన మై యున్నపు డీతఁడు గందనవ్రోలు (కర్నూలు) మండలములోని యాకునీడు నంద్యాల మొద లైనసంస్థానములలోఁ జేరినట్టు చూపట్టెడిని. ఈకవి కృష్ణదేవరాయనియాస్థానకవీశ్వరు లైన యష్టదిగ్గజములలో నొకరుం డని చెప్పుదురు. ఈయన హూణశకము 16 వ శతాబ్దమధ్యమున జీవించినట్టివాఁడు. ఇతఁడు కావ్యరచనయందు సర్వతోముఖచాతుర్యము గలవాఁడు. ఈతనికవిత్వము మృదుపదవిరచిత మై ద్రాక్షాపాకకల్పముగా నుండును. గరుడపురాణము, కళాపూర్ణోదయము, ప్రభావతీప్రద్యుమ్నము, గిరిజాపరిణయము, లోనగుగ్రంథములను రచియించి యున్నాఁడు.

తే. సుమపరాగముల్ గేళిపాం ♦ సువులుగాఁగ, భ్రమరపంక్తులు పైపైవ ♦ రణలుగాఁగఁ
ఋతుమి సెల్లెస వాహ్యాళి ♦ వెడలుమదను, మసవృలేనుఁగుప్రాలె నా ♦ మనిదవర్చె.

రగడ. పొలిచె మధులక్ష్మి సుర ♦ పొన్నలను బొన్నలను
దెలివిపడెఁ బుష్పాడుల ♦ దిన్నలను జిన్నలను
రంగుగఁ దనర్చునా ♦ రంగములనంగములఁ
బింగళత సెందె మద ♦ భృంగములయంగములఁ
గొఱలెఁ జిగు రెలమావి ♦ గున్నలను జిన్నలను
బఱిచె మరుఁ డురుల ముది ♦ పన్నలను బిన్నలను
లఱఁ జిక్కెఁ గరువలిబ ♦ లంగము లవంగముల
లులిత మై లవలీకు ♦ ళుంగముల లుంగముల
వెలయఁ గురువిందపూ ♦ విరువులును మురువులును
దెలిపె మదనునకుఁ బని ♦ తెరువులును హరువులును
బెరయుమఁ బలాశతరు ♦ బృందముల నందముల
విరిమొగ్గ లమరెఁ గురు ♦ విందములచందముల
నెన్నికగ వాసించె ♦ నిరువులును బొరువులును
జిన్నిచెందొవలచేఁ ♦ జెరువులును దొరువులును
వేలఁ గొలు వమరె నర ♦ విందములఁ గుందముల
లీల దళుకొత్తఁగ మి ♦ ళిందములడెందముల
మెదలె మలయాచలస ♦ మీరములు సారములు
కొద విరహి కయ్యె నతి ♦ ఘోరములుఁ గ్రూరములు
జడిగొనుమధూళికా ♦ సారములపూరముల
వడి దనరె నవసిందు ♦ వారములయారముల
వదరెఁ గడుఁ గ్రొవ్వి పిక ♦ వారములుఁ గీరములుఁ
గదిరె నళులందు ఝం ♦ కారములు బీరములుఁ
గలఁగి పాంథులు కర్ణి ♦ కారముల వేరములఁ
దొలఁగి రిల ఘుంటలకు ♦ మారములమారములఁ
బొదలె నంపెఁగలందుఁ ♦ బూవులును దావులును
గుదిగొనఁ దలిర్చెఁ గడుఁ ♦ గ్రోవులును మోవులును
సారె వడతొఁకు ♦ సంచారికలచేరికల
జారులు చరించి రభి ♦ సారికలకోరికల



నిగురుఁబోం డ్లెన్న రై ♦ రివులును గీవులును
డిగజాఱి విడిచి రటు ♦ రీవులును నావులును
దదనంగతంత్రావ ♦ తారికలకారికల
చదు వంటెఁ గేలివన ♦ శారికలఁ గీరికల
మితి లేక పరఁగె రతి ♦ మెలపులును వలపులును
నతివ లెంతయు మఱచి ♦ రలపులును సొలపులును
బోణిమిగ వకుళకుజ ♦ పూగములఁ బూగముల
రాణ దనరారెను బ ♦ రాగముల రాగములఁ
బరఁగె మధుమదనులకు ♦ బలుపులును గెలుపులును
బెరిఁగె యువయువతులకుఁ ♦ బిలుపులును బొలుపులును
రంజిలిరి గాణ లను ♦ రాగముల రాగములఁ
బుంజితశ్రీఁ దనరు ♦ భోగములఁ జాగముల
నలముకొని పెంటిచెర ♦ లాటములుఁ గూటములు
సలిపె నహిపక్షిమృగ ♦ ఝూటములుఁ గీటములు
సోరిది మధువృష్టి వం ♦ జులకములఁ దిలకములఁ
గురిసెఁ జెదరుచుఁ దేంట్ల ♦ కులకముల జలకములఁ
గయికొనియె ననుపుపన ♦ గాటములు వాటములు
నయి తరులతలపెనఁగు ♦ లాటములు నోటములుఁ
బొరసె విరహిణుల కురు ♦ పులకములఁ దిలకములఁ
బరుసఁదనము కపోల ♦ ఫలకముల నలకముల
సరిగె నానాలతా ♦ జాలములు సాలములుఁ
జరదళుల నయ్యె వా ♦ చాలములు నీలములుఁ
దళు కెసఁగఁ బల్లవవి ♦ తానముల సూనములఁ
బులియఁ బికమధుపములు ♦ బోనములఁ బానముల
జవిగొనిరి గఱువలు పి ♦ సాళములు మేలములు
మివులఁ దపసికి నించె ♦ మేళములుఁ దాళములుఁ
దగ మసలు భసలసం ♦ తానముల గానముల
మగువ లెగఁజోపి రభి ♦ మానముల మానముల
వడిఁ ద్రిప్పి మరుఁడు జయ ♦ వంతములు గుంతములు
సడలించె మునిజన ♦ స్వాంతములు శాంతములు

మందిరారామవన ♦ మాలికలడోలికలఁ
బందెములు జరిగెఁ గుల ♦ పాలికలకేలికల
సతతము సుగంధపువ ♦ సంతములఁ బంతములు
ప్రతులకును నయ్యె రస ♦ వంతములఁ గాంతములు
మరగి యెపుడును గంత ♦ మాలికలపోలికలఁ
బరఁగ మగ లిడి రంక ♦ పాలికల బాలికల 118

## కళాపూర్ణోదయము ❁

### సప్తమాశ్వాసము.

(కళాపూర్ణుం డనుపుడమిఱేఁడు మధురలాలసం బెండ్లియై యమ్మానిని తోడఁ జలినెలలు గడపెఁ దదనంతరంబు.)

మాలిని. వికసితఘనసూనో ♦ ద్వేలజాలప్రవాళ
ప్రకటకపటరూఢ ♦ ప్రౌఢకీర్తిప్రతాప
ప్రకటజయసమంచ ♦ త్పంచబాణ స్తవోగ్రా
యకశుకపిక కాంతం ♦ బై వసంతంబు వచ్చెఁ.

## భీమేశ్వరపురాణము ‡

### పంచమాశ్వాసము.

(దాక్షారామంబునకు లోపాముద్రాసహితుం డై యరుగు చుండిన యగస్త్యుండు మార్గంబున సాత్యవతేయునితోఁ గూడి యాయనకు భీమ మండలంబునం గలతీర్థవిశేషంబులం జూపుచు, దాక్షారామంబు సొచ్చి, యచ్చటిమహిమం బెల్ల సమగ్రంబుగఁ దెల్పుచుఁ, బ్రసంగవశంబున నిట్లనియె. తొల్లి బృహస్పతియుపదేశంబున దిపస్పతి భూదానం బొనరింప

---

❁ కళాపూర్ణోదయమును రచియించిన కవి పింగళిసూరన. 31వపొరటలోని టిప్పణి చూచునది.

‡ భీమేశ్వరపురాణమునకే భీమఖండ మనియుఁ బేరు. శ్రీమహాస్కాందంబునందలి గోదావరీఖండంబులో శ్రీదాక్షారామభీమేశ్వరమాహాత్మ్యం బుండుటంజేసి యయ్యది భీమేశ్వరపురాణ మనంబరఁగు. దానిని రచియించినకవి శ్రీనాథుఁడు. ఇతఁడు పాఁకనాటినియోగి బ్రాహ్మణుఁడు. పద్మపురాణమును దెలిఁగించినకమలనాభకవిపౌత్త్రుఁడు. మారయ



నెంచి సమస్తదేవతాసార్వభౌముం డైనభీమనాథునకు మార్గశీర్ష శుద్ధచతుర్దశి నాఁడురోహిణింగూడినసిద్ధయోగమునందు దాక్షారామసమేతం బగుభూమి వారవధూత్రిశతద్వయంబుతోడ దానంబుసేసె. అట్టిభూమిని భీమేశ్వరుండు ధామంబునుగాఁ గొని గజముఖునకు యువరాజపట్టంబు గట్టి యేక చ్ఛత్రంబుగాఁ బాలించుచుండె నట్లు.)

శా. శ్రీకంఠుండు త్రిలింగభూవలయముక్ ♦ శ్రీభీమనాథేశ్వరుం
డేకచ్ఛత్రముగా సమస్తభువనా ♦ధీశుండు పాలింపఁగాఁ
బాకోన్ముద్రితమాధవీవిచికల ♦ ప్రత్యగ్రసౌరభ్యల
క్ష్మీకం బైనవసంతకాల ముదయిం ♦ చెక్ సౌఖ్యసంధాయి యై. 120

తే. సకలదేవతామండలీ ♦ సార్వభౌము
దక్షిణాపథకాశికా ♦ ధవునిఁ గొల్వఁ
గుసుమవిసరంబు గానిక ♦ గొంచు వచ్చె
నఖిలఋతుచక్రవర్తి మ ♦ ధ్వాగమంబు. 121

తే. కమిచె సురపొన్న వనలక్ష్మి ♦ కబరిమీఁద
నవదరించిన ముత్యాల ♦ జల్లివ్రాలెఁ

---

పుత్త్రుఁడు. రాజమహేంద్రవర మేలుచుండినపంటకొలమురెడ్ల కాస్థానకవీశ్వరుఁడు. కవిత్రయంబునకుఁ దరువాతఁ బ్రసిద్ధి వడసినకవి యీతండ యని చెప్పవలయును. ఇమ్మహనీయుఁ డాంధ్రరాయనియొద్దఁ గవిసార్వభౌముం డనుబిరుదు గాంచినవాఁడు. ఇతండు వేమారెడ్డికిని వీరభద్రరెడ్డికిని నాస్థానకవి యగుటచే హూణశకము 1435వ సంవత్సరముదాఁక జీవించియుండినట్లు దెలియవచ్చుచున్నది. ఈకవీంద్రుఁడు, లక్షణయుక్తంబై రసవంతం బై యుండునట్లు కవిత్వము చెప్ప నేర్చినవారిలో, నొకరుం డని యెన్నంబడు. ఇతనిగ్రంథములందు శృంగారనైషధము సంస్కృతపదభూయిష్ఠ మై యతిప్రౌఢ మై యుండును. దీని నాంధ్రకావ్యపంచకములో ముఖ్యమైనదానినిగా గణింతురు. ఇతనికాశీఖండము సరస మై జాత్యసమన్విత మై యత్యంతరమ్య మై యున్న దని చెప్పవచ్చును. ఇతఁడు ర[illegible]సినతక్కినగ్రంథములు మరుత్తరాట్చరిత్రము పండితారాధ్యచరిత్రము శాలివాహనసప్తశతి [illegible]థినాటకము హరవిలాసము లోనగునవి.)

బూచె సంపెంగ యారామ ♦ భూమియందుఁ
గుసుమనారాచుచిచ్చుల ♦ కోలవ్రాలె. 122

శా. హేమంతావధిసంప్రబోధగురువుల్ ♦ హృజ్జాతతేజోగ్నిధా
య్యామంత్రాక్షరముల్ పటీరగిరిధ ♦ న్యామందవాతూలముల్
వేమాఱుం గలశీతనూభవవధూ ♦ వేణీభరాంతప్రసూ
నామోదగ్రహయాళువుల్ వొలసె దా ♦ క్షారామమధ్యంబునన్. 123

తే. పాంథనివహంబుపాలియు ♦ త్పాతకారి
ధూమకేతువుఁ బోలి లేఁ ♦ దోఁటనడుమ
విరిసెఁ గ్రొవ్వారి నాగకే ♦ సరపుఁబువ్వు
మీఁదిధూమంబుభంగిఁ దు ♦ మ్మెదలు వెడల. 124

శా. సంధుగ్ధార్ణవచంద్రమండలశిఖి ♦ జ్వాలాతటిద్వల్లరీ
కందర్పేంద్రశరాసనాచ్యుతతనూ ♦ గంధర్వవంశోద్భవల్
హిందోళంబునఁ బాడి రచ్చరలు భీ ♦ మేశుం ద్రిలోకాధిపున్
మందారద్రుమవాటియందు సుమనో ♦ మైరేయముల్ గ్రోలుచున్. 125

మ. అళికోలాహలసంభ్రమంబును శుక ♦ వ్యాజృంభియున్ శారికా
కులసల్లాపములున్ విహారవిపిన ♦ క్షోణీవిభాగంబునం
గలపుంస్కోకిలకంఠకోమలకుహూ ♦ కారప్రపంచంబుతోఁ
దలఁపించెన్ స్మరకాంతమూలరథినీ ♦ ధాటీసమారంభమున్. 126

వ. మఱియును దత్సమయంబు భువనోత్సంగమంగళాలంకారం బైనదాక్షారామంబునఁ బరిసరారామంబులయందుఁ బరమపరిపాకభిదురఫలావేడదాడిమీకుడంగక్రోడక్రీడిత చిక్రోడయూథంబును బరిసక్రమతామ్రచూడచూడ తామ్రకిసలయామ్రేడితమదనసామ్రాజ్యపూజ్యంబును నవకుసుమమధుపానహర్షితపుష్పతరుపుష్పితలావణ్యవిశేషంబును వనదేవతాతంతన్యమానాళినీచయలోచననిచయమేచకమోచారణ్యంబును బరిసరావనీరుహ నివహాకులవనీసనిస్రస్యమానసీధుధునీజంబాలబాలవనవిభాగంబును మదచలవరచంచరీకచక్రచరణతాడనచంచలచంపకదాడిమప్రసవమంజరీరజఃపుంజసమత్పింజరీకృత

123. మలయమారుతములు 91వపద్యంబునను వర్ణింపఁబడియున్నవి. ఇందలివర్ణనమునకును దానికిని భేదము గలదు.



కుంజంబును గంధసారగిరిగంధవాహప్రవాహలహరికావిహారబహుళీభూతనూతనక్రముకకుహళీగర్భనిర్భరామోదమోదంబును నగుచు జగదాహ్లాదంబు సంపాదించుచు విజృంభించె. 127

## తపతీసంవరణము *

### చతుర్థాశ్వాసము.

(హస్తిపురాధీశ్వరుం డయినసంవరణుండు శుకంబువలనఁ దపతీవృత్తాంత మంతయు నాలించి యన్నెలంతం దలంచుచుండె. చిలుక సంవరణుని వృత్తాంతంబు దపతికిం దెలుప నయ్యిందువదనయుధారుణిం గాలయాపనం బొనరింప వయస్యలతోడఁ బుడమి నవతరించె.)

ఉ. అంత వసుంధరం గలవ ♦ నావళి ధోరణి గొప్పె భుగ్నహే
మంతము సుప్రసాదరుచి ♦ మంతము భోగిజనప్రతానని
శ్చింతము మానినీజనవి ♦ శేషదురంతము దర్పితాఖిల
స్వాంతము దీప్తిమంతము వ ♦ సంతము గంధతరంగవంతమై. 128

మ. మలయక్ష్మాధరమందునుండి మెదలెన్ ♦ మందానిలాంకూరముల్
నలు వందం జిగురెత్తె భూజములు గం ♦ దర్పాస్త్రశాలాకృతిం
గలయం బూచె నశోకవృక్షములు భృం ♦ గవ్రాతజీవాతువుల్
పలుమాఱున్ భుజ మప్పళింపఁ దొడఁగెం ♦ బంచాస్త్రుఁ డుద్యుక్తుఁ డై. 129

క. భృంగధ్వనిమంత్రంబుల
రంగద్ద్రుమయాజకోత్క ♦ రము నవదళవ
హ్నిం గుసుమరసాలముచే
నంగజుపట్టాభిషేక ♦ హవనముఁ జేసెన్. 130

* గోలకొండనవాబయినమల్కిభరాము (ఇబ్రహీం మల్కు) నొద్ద నాస్థానకవీశ్వరుఁ డై యుండినయద్దంకిగంగాధరకవిచేఁ దపతీసంవరణ మనియెడియీప్రబంధము నిర్మింపఁబడియె. ఈగంగాధరకవి వీరనామాత్యునిపుత్త్రుఁడు. యయాతిచరిత్రము రచియించినపొన్నికంటితెలగనార్యుఁడుగాక తనగ్రంథమును మహమ్మదీయుల కంకితము సేసినతెలుఁగుకవి యీతఁ డొకఁడు. ఈకవి హూణశకము 1550 వ సంవత్సరముమొదలు కొని యున్నవాఁడు.

ఉ. పల్లవగుచ్ఛకచ్ఛవులు ♦ బంగరుపింజతెఱంగు మించఁగాఁ
జల్లనిమందమారుతవ ♦ శంబునఁ బుప్పొడిఁ గ్రాయఁ గ్రొవ్విరుల్
బల్లిద మొప్ప మానినుల ♦ పైఁ గడు నాగ్రహ మెత్తి యంగభూ
భల్లచయంబు కోపమునఁ ♦ బావకకీలలు గ్రక్కెనో యనన్. 131

ఉ. కేళివనాంతరాళమునఁ ♦ గేసరసూనసరస్సరందముల్
గ్రోలి విటీవిటుల్ శిశిర ♦ కుంజములందు వసంతవేళకుం
బాళ మెఱింగి కిన్నెరలు ♦ బంగరువీణెలు మేళవించి హిం
దోళ మొనర్చి పాడిరి మ ♦ నోభవదిగ్విజయాంకగీతముల్. 132

క. మరుదంకురములు వొలసిన
సారిదిం జనియించుచిగురు ♦ జొంపము లమరెన్
విరహులగుండియ లవియం
బరువడి జళిపించుమరుని ♦ పట్టెము లనఁగన్. 133

## యయాతిచరిత్రము ✿

### చతుర్థాశ్వాసము.

(మున్నొకప్పుడు వేల్పుటొజ్జకొడుకు కైనకచుండు శుక్రునియొద్దఁ సంజీవని యనువిద్దియం గఱవ వచ్చి యుండె. అట్టియెడ శుక్రునికూఁతురు దేవయాన యనంబరఁగినకన్నియ యక్కచుం గనుంగొని యాతనిపై వలపుగొని యువ్విళ్లూరుమనంబునఁ దనకోర్కి నివ్వటిల నెవ్వెరవేనిఁ గలచే యని వగచుచుండి యొట్టకేలకుఁ దనయిచ్చ నెఱింగింప నాతండు చెవులు మూసికొనుచుఁ జదువు సెప్పినయతఁడుం దండ్రియు నొక్కరూప కావున నీవు నాకుఁ జెలియల వైతివి నిన్నుఁ జెట్టవట్టుట పాడి గా దని పలికె. అంత దేవయాన యలిగి యక్కచుం జూచి నీకు సంజీవని పంపుసేయకుండుత మని సెపించిన నతండు నాకుఁ బంపుసేయకున్న నావలవ నేర్చినవారికేనిఁ బనిసేయదే యని నుడివి యంతఁబోక కినుకమై నీ విట్లు పని మాలిన పాట నన్నుఁ బల్కితి గావున నీకు నేలవేలుపు మగండు గా కుండుత మని పల్కి తననెలవునకుం జనియె. దేవయానయు వృషపర్వునికూఁతురు శర్మిష్ఠ దన్నుఁ గొలువం బాటలం దేటమాటలం దోఁటలం బ్రొద్దు గడపుచుండె నంత).

చ. కరువలిరక్కసుల్ గిముకఁ ♦ గ్రమ్మి వడంకఁగ మ్రాఁకువేల్పులన్
దొరఁకొని యాకురెంబెముల ♦ దోఁచినఁ గోవెల కూఁకఁ జెప్పఁగా
నరయుచు వారలం గడిమి ♦ నామనివెన్నుఁడు నొంపఁ జిందునె
త్తురుబలె లేఁజిగుళ్లలరెఁ ♦ దోఁపులఁ జూపఱచూడ్కిపండు వై. 134

సీ. అలమింటఁ జెలఁగురా ♦ చిలుకలచాలుపుల్, వేలుపుమన్నీని ♦ విండ్లు గాఁగఁ
బూఁదేనియలఁ జాలఁ ♦ బొదలుతేఁటులమ్రోఁత, రిపు మించునుఱుములరవలి గాఁగ
మోక లై పొడ వైన ♦ చీకటిమ్రాఁకుల, చాళ్లు గార్కొన్నమొ ♦ యిళ్లు గాఁగ
వెలుతు రీయక జాఱు ♦ విరిదేనియలసోన, వదలక కురియుపెన్ ♦ వాన గాఁగ
తే. వేడుకలు మీఱఁ దోఁటల ♦ నాడుకొమరు, వెలఁదు లెల్లను మెఱుఁగుఁదీ ♦ వియలు గాఁగఁ
గ్రమ్మి యుప్పొంగుచునుదొలఁ ♦ కారువ్రాలె, వలపు నెఱపుచు నామని ♦ పాలుపుమీరె.

తే. ఎలమిమై జాజియీరంపు ♦ శేనుఁగులను
నొంచునామని యనుతెఱ ♦ నూరిమొకము

133. ఇంగలివిషయమునకును 113వపద్యములోనివిషయమునకును నొకింతపోలిక యున్నది.

✿ యయాతిచరిత్రము శుద్ధాంధ్రగ్రంథములలో మొదలిటిది. అన్నివిధంబులచే ని య్యది, కూచిమంచితిమ్మన రచియించినయచ్చతెనుఁగుఁగబ్బములకంటెను మేలైనది. ఏత త్కృతికర్త పొన్నికంటి తెలగనార్యుఁడు. ఇతఁడు, తపతీసంవరణకృతినాయకుఁ డైన యిభరాముసొద్దఁ గొలువున్నయమీనుఖానునకుఁ, దనరచియించినయయాతిచరిత్రము సంకీత ము సేసెను. ఇభరామప్రభువు (ఇబ్రహీంమల్కు) కుతుపషావంశీయు లైనగోలకొండ నవాబులలో మూఁడవవాఁడు. ఈనవాబు హూణశకము 1550వసంవత్సరము మొదలు 1581వ సంవత్సరమువాఁక రాజ్యపాలన మొనరించె. ఇతనిప్రభుత్వకాలమందుఁ దిరుమల దేవరాయనికొడు కైనశ్రీరంగరాయఁడు విజయనగరరాజయి యుండెను. ఈశ్రీరంగ రాయఁడు హూణశకము 1574వసంవత్సరము మొదలు 1585వసంవత్సరమువాఁక రాజ్యము సేసినట్లు గానంబడుచున్నయది. కావున యయాతిచరిత్రము హూణశకము 1574-1581 సంవత్సరములకు మధ్యకాలమందు రచియింపఁబడినది.

135. ఇందలివిషయమే 18, 26, 30, 94 ఈపద్యములలో నెంతవట్టు వర్ణింపఁ బడెనో చూచుకొనునది.

గోళ్లనంగను దగి మోదు ♦ గులను మొగ్గ
లమరెఁ దమరంగు మిన్నెల్ల ♦ నలమికొనఁగ. 136

క. క్రందుకొను చిగురుజొంపము
లం దగెఁ బలుమావు లంత ♦ లలి నెల్లెడలం
జెందిరపుఁగాలి పడగల
నందం బగుమరుని తేరు ♦ లనఁగాఁ బొలుపై. 137

మత్తకోకిల. ఏచె మావులఁ గ్రోవులుం దగు ♦ నిప్పలుం గురివెందలుం
బూచె నిమ్మలు దాడినిమ్మలుఁ ♦ బొన్నలున్ సురపొన్నలుం
గాచెఁ జిన్నలకన్న మున్నుగ ♦ గంగరావులు మోవులన్
రాచెఁ గొమ్మల నింగి గోఁగులు ♦ రావులుం గడుఁదీవులన్. 138

శా. వ్రేలుంగొమ్మలు నేల దారసిలినన్ ♦ వెల్లంగ రాకుండఁగా
లోలోఁ ద్రిమ్మరువాలిగాడ్పులు పగ ♦ ల్లున్ రేలుఁ బూఁదావులం
జాలన్ మ్రుచ్చిలి పోవఁ బట్టుకొని ప ♦ జ్జం బచ్చగండాగ్లలో
సోలం గావలిఁబెట్టె నామని యనం ♦ జూపట్టె లేఁదోఁటలన్. 139

తే. అమరెఁ బుప్పొడి కుప్ప లై ♦ యంత నంత
మెట్టదామరపాకుల ♦ మీఁద జాతి
పైఁడిమూలాలివేవిళ్లు ♦ వాయఁ దోఁట
కలిమిచెలి వెట్టుకలవంట ♦ కంబు లనఁగ. 140

చ. చలిమిరిగాడ్పుచే నెగసి ♦ సన్నపుసుళ్లగు చాకసంపుమం
దల వలరాఱెఁ బుప్పొడులు ♦ దట్టముగా మదిఁ గ్రమ్ముకూర్మిచేఁ
గలఁగి విరాలిఁ గుందుతెఱఁ ♦ గంటి నెలంతలమీఁదఁ జొన్నపూ
విలుతుని పైఁడిచుట్టలుఁగు ♦ వేలములుం బలె సొంపుపెంపునన్ 141

క, అగిసెవిరుల్ గరువలిచే
నెగయం దోఁ దేఁటిచాల్పు ♦ లేఁగుం దఱుచై
తొగరాచపదువులన్ వెను
తగులుచు నెలదిండిపిండు ♦ దాఁకొను పగిదిన్. 142

---

136. ఇందలివిషయమును 9వపద్యమునందలివిషయముతో సరిపోల్చి చూచుకొనునది.
141. సుడిగాడ్పులవర్ణనము 59వపద్యమునం దెట్లున్నదో కనుంగొననగును.



మ. ఎలమిం దుమ్మెదమ్రోఁత వాసెరవలై ♦ యింపొంద మత్తిల్లుకో
వెలసీకారులకూఁకపాట లమరన్ ♦ వేవేడ్కతో నాలిగా
డ్పులపేరం గలనట్టువుల్ గఱపఁ గో ♦ పుల్ సూపులేఁదీవపా
త్రల కయ్యామని పూవుముత్తెపుసరుల్ ♦ దాల్పంగ నిచ్చెం గడున్. 143

వ. మఱియు విరితేనియ లాని పూని మత్తిలి తత్తఱంబునం దిరుగు తేఁటిమొత్తంబుల యొఱకలసన్నం గరువలి గట్టివనట్టువ గఱప నామని రాఱేనికడ నాడుతీవపాత్రల ముందఱఁ గ్రందుగా నెత్తినమవ్వంపుదుప్పటంబులతెరలమురువు లనం గ్రమ్ముపూదుమ్ములముమ్మరంబులం గొమ్మలం గానక త్రిమ్మరుకలికిరాచిలుకలపలుకులరొదల నెదలు గలంగ మెలంగుతెరువరుల నేయ బాసటంబు చిలికినమరునిచిలుకులుం బోని తుమ్మెదదిమ్ముల నలరునలరులం గాంచి వలఱేనికానిపనికిఁ గినుకం గనుంగొనుతోఁటకలిమి చెలియచూపులసొంపునం గెంపుపొసనంబు లగుదాసనంబులును దాసనంబులు చీకటిమ్రాఁకుమూఁకలలోన నిరులదొరలు దమదాయ యగువేఁడివెలుంగు నింగికి వెఱచి, పఱచిన నతనిమైపుట్టుగులం బట్టి లో నిడుకొన్నవడువున నున్నం గెకిసలుగొట్టునిగ్గ పట్టిపిండునుం బోలెఁ జెలంగుకోవెల లొగరుంజిగురు లుమియం గని మున్నీటి నీటితో నానినమానికంబులు వెడలించు నించుమొగులుం దెగ లని బెట్టుగా నాడు జుట్టునట్టువపిట్టలు కట్టలుక రేఁచి చిలువతెఱవ లనుతలంపుపెంపున జడల కొడియ వడివడిం దీవయుయ్యెల లూఁగుమగువలనగవువెన్నెలలోన చిక్కులపెక్కువలుం బోలెఁ గానిపించుపొన్నమొగ్గలును బొన్నమొగ్గలహత్తినముత్తెపుందొడవు లయ్యెడ నిడి పూఁదేనియలజలకం బాడు తోఁపువేలుపుఁజానకు దిద్దిననిద్దంపుఁబసుపుముద్దలయొద్దికం దగు పెద్దనిమ్మపండ్లును నిమ్మపండ్లయచ్చపుఁబచ్చడాలు చాల న్మిఱుచుం గారుగోఁగుల పైఁబర్వఁ జనుపకంబు లని కలంగి తొలంగి చేరక తిరుగుతత్తఱంబుల తేఁటిమొత్తంబులం గేలిసేసి మించుతీవెచానలయెలుంగు లనం బలుకులు గల కలికిచిలుకలును జిలుకముక్కుల నొక్కంబడుదొండపండ్లచెన్ను గని తమయన్నులమోవులపోలిక లని విరాళిం జాలింబడు తెరువరులం జూచి వగచుమ్రాఁకులకన్నీరునుం బోలె జోరునం జాఱు పూఁదేనియలును బూఁదేనియకాలువవల్ల సుళ్లంబడి వడివడిం దిరుగుమరునికెంపుబొంగరంబులుం బోని మెట్టదామరమొగడలును దామరమొగడలం దెగడు చిన్నివన్నెలు గలకన్నియ లన్ను చూపం బూఁదేనియ లాని దీనియలయందుం బాడు నేర్పులకు మెచ్చి పచ్చవిల్కాఁడు గురియించువిరివానలుం బోలెఁ గరువలిచేఁ దొరఁగుపరువంపు ననలునుం గలిగి; వలరాయనిలాయంబునుం బోలె మావులకుం దానకం బై చానల

సోయగంబులుం బోలెం బాపటల సొంపుమీఱి వెలయాంధ్రచెక్కులపెక్కువం గోరంట
లలిం బొదలి తోంపు చూపఱకుం బేరామని గానామని యొప్పె. 144

## వసుచరిత్రము ❁

### ప్రథమాశ్వాసము.

(చేదిదేశంబునం గలయధిష్ఠానపురవరంబును దనకు రాజధానింగాం జేసి కొని, వసుం డను రాజు నిరంతరయశఃప్రతాప సంపన్నుం డయి, తనశౌర్యంబునం జేసి పురందరుండు దనకు సఖుం డై వెలయ నత్యంతభోగసమన్వితుం డయి, ధర్మోత్తరంబుగాం బ్రజాపరిపాలనం బొనరించుచుం, దనపురి కనతిదూరంబున నున్న కోలాహలపర్వతంబును గ్రీడాశైలంబునుగాం గొని వర్తించుచుండె. అంతం బుడమిచేడియ వసంతలక్ష్మిచే నొప్పారె.)

క. ఆగతి నభిమతభోగ
శ్రీ గలభువి కొసంగె నుల్ల ♦ సితపత్త్రిలతా
సౌగంధ్యము నవకళికా
సౌగంధ్యము చైత్రలక్ష్మి ♦ సైరంధ్రిక్రియన్. 145

సీ. లలనాజనాపాంగ ♦ వలనావసదనంగ, తులనాభికాభంగ ♦ దోగ్రిప్రసంగ
మలసానిలవిలోల ♦ దళసానవరసాల, ఫలసాదరశుకాల ♦ పనవిశాల

---

❁ వసుచరిత్రంబు రామరాజభూషణకవిచే రచియింపంబడినది. ఈరామరాజభూషణునకే బట్టుమూర్తి యనుమఱియొకనామంబు గల దని కొందఱును బట్టుమూర్తి నామంబునం బరంగువాండు మఱియొక్కరుం డని కొందఱును జెప్పుదురు. రామరాజభూషణుండు సాహిత్యంబునందకాక సంగీతంబునందును నసమానప్రజ్ఞ గలవాండు. ఇతని సమకాలికు లయ్యలరాజు రామభద్రుండు లోనగువారు. ఈతనిజన్మభూమి బట్టుపల్లె. ఈబట్టుపల్లె కడపమండలములోని పులివెందలతాలూకాలో నున్న ట్లొక్కరును బళ్లారిమండలములోనిపాలమండలముదగ్గఱ నున్నట్లు మఱియొక్కరును వ్రాసి యున్నారు. వసుచరిత్రము హూణశకము 1570వసంవత్సరమునకుం దర్వాత రచియింపంబడినది. ఇయ్యది శ్లేషకావ్యంబులలో నుత్తమం బయినయది. ఇందలివర్ణనంబు లత్యంత శ్లాఘాపాత్రంబులు. కవిత్వంబు మృదుపదవిరచితం బై రసవంతం బై యలంకారభూయిష్ఠం బై మిక్కిలిశ్రావ్యం బై యుండు. ద్వ్యర్థికావ్య మైనహరిశ్చంద్రనలోపాఖ్యానంబును నీరామరాజభూషణకవిచే రచియింపంబడినది.



మలినీగరుదనీక ♦ మలినీకృతధునీక, మలినీసుఖితకోక ♦ కులవధూక
మతికాంతసలతాంత ♦ లతికాంతరనితాంత, సురుచిరోత్సవతాంత ♦ సుతనుకాంత
తే. మకృతకామోదకురువకా ♦ వికలవకుళ, ముకుళసకలవనాంతప్ర ♦ మోదచలిత
కలితకలకంఠకులకంఠ ♦ కాకలీవి, భాసురము వొల్చు మధుమాస ♦ వాసరంబు. 146

చ. ఒనర హిమావగుంఠనము ♦ లూడ్చి తెమల్చినపత్త్రిభంగముల్
నన నసియాడుచున్ మొగడ ♦ చక్కులు పల్లవపాణిం గప్పనూ
తనలతికాలతాంగుల ను ♦ దారగతిం జలి వాపి నెయ్యపుం
బెనంకువ నేర్పె దక్షిణస ♦ మీరణుం డొయ్యన తావు లంటుచున్. 147

మ. అలరుం గైదువుజోదుమూర్తి సయిదో ♦ డై మాధవశ్రీతపగి
ఫల మై యాడుమరుత్కుమారుం బ్రియ మొ ♦ ప్పం దేనెనీ రార్చి పెం
దలిపూజొంపపుంబొత్తులం బొదివి ధా ♦ త్రీజాతముల్ జోలపా
డె లసత్పల్లవడోల నుంచి కలకం ♦ ఠీనాదగీతంబులన్. 148

సీ. మును సుమనోరాగ ♦ మున వసంతము నూపెం, గానవేందిర యశో ♦ కంపుంగొమ్మ
కాకొమ్మ నగుచు నె ♦ య్యమునం గ్రొన్ననతేనె, మెలంగెడు సరసాళి ♦ మీందం జల్లె
నాసరసాళి సో ♦ యగపుంబాటలతోడం, జని మాధవిప్రవాళ ♦ శాటిం దుడిచె
నామాధవి పరాగ ♦ మక్షిరాగము మించం, బఱతెంచుకలకంఠి ♦ పై విదిర్చె
తే. నిట్లు లతికలు హితకోటి ♦ నెనసి యపుడు, మదనదేవోత్సవక్రీడం ♦ బొదలు ననిన
వరులుం దరుణులు విరులయో ♦ వరుల వఱలు, సిరుల వలరాచజాతరల్ ♦ సేయు టరుదె.

మ. అరిగాం బంచమ మేవగించి నవలా ♦ లవ్వేళ హిందోళ వై
ఖరి నూపం బికజాత మాత్మరవభం ♦ గవ్యాకులం బై వనీ
ధర నాలంబితపల్లవవ్రతవిధుల్ ♦ దాల్పం దదీయధ్వనిన్
సరిగాం గైకొనిరొక్క వసంతము మహా ♦ సంపూర్ణభావోన్నతిన్. 150

మ. కరఘాతంబుల కోర్వలేక హిమసం ♦ ఘాతంబు శీతక్షమా
ధరదుర్గంబు భజింపంగా నలజగ ♦ త్కంపప్రదాస్తోకభీ
కరదోషాయతిశాలిం జుట్టుకొని ల ♦ గ్గల్ వట్టి దట్టించు నం
చరవిందాప్తుం డుదీచి కేంగెం బ్రబలుం ♦ డై మాని దాక్షిణ్యమున్. 151

మ. చివురుం గైదువుచేల్పు చైత్రమున న ♦ క్షీణధ్వజోత్క్షేపవై
భవుం డై తెమ్మెరతేరిపైం గదలి రాం ♦ బ్రత్యగ్రసాలాగ్రహా

ర్మ్యవిటంకంబులు వ్రాఁకి వల్లివనజా ♦ స్యల్ సల్లి రుత్ఫుల్లప
ల్లవహస్తంబుల భావిభావుకఫలో ♦ ల్లాసంబుతోఁ గ్రొవ్విరుల్. 152

మ. మహిళామండలమంజులభ్రమరకా ♦ మర్దంబు శ్యామాముహు
ర్ముహురున్మీలితపత్త్రిభేదనిపుణం ♦ బుం బద్మినీకంకణ
గ్రహణాపాదియు నై సగంధవిటప ♦ ప్రాప్తిన్ విజృంభించుచున్
విహరించెన్ మధుమత్తగంధవహ మ ♦ వ్వేళన్ వనాంతంబునన్. 153

సీ. ఏపారుపాదరింట్ల ♦ నాపాటలాశోక, దీపార్చిఁ గనకక ♦ లాప మరసె
సాలావలులు దాఁటి ♦ యేలాలతావార, బాలాతతి పరాగ ♦ పటము లూడ్చె
నానామధుపనవ్య ♦ గానామృతము మెచ్చి, సూనాసవము లెల్లఁ ♦ జూఱ లిచ్చె
శంకారహితధీర ♦ హుంకారశుకభటా, హంకారముల ఫలా ♦ హతి యొనర్చె
తే. ననుచు నాగంధవహునిధా ♦ ర్త్యములు దెలుపు,లీలవిరిసినవిరులు రా ♦ లినరజంబు
లాలికినరసంబు లురలిన ♦ ఫలము లధిపు,మ్రోల నిడి పల్కి రుద్యాన ♦ పాలురపుడు.

క. స్వామీ యే మని పొగడెద
మామనికిన్ మనికి యైన ♦ యారామమునం
గామనిశితాస్త్రములు ద
త్కోమలతరలతలు చిగురుఁ ♦ గొమ్మలచేవల్. 155

తే. నాథ చివురులు రంజిల్లె ♦ ననలు మొలిచె
నలరె విరు లెల్లఁ బూపలు ♦ దలలుసూపెఁ
బసిమి నిరవొందెఁ బిందియల్ ♦ బలిసె నవళ
లాటువులు సాంద్రరుచుల ఫ ♦ లంబు లెసఁగె. 156

ఉ. కేళివనాళి నీయెడ శు ♦ కీనివదార్భటి చెప్ప నేల భూ
పాలక నీలకంఠములు ♦ పాయక మ్రోయ లతాంతవాసనా
జాలము సోడు ముట్ట సుర ♦ సాలము వీడ్కొని వచ్చుపట్పదీ
మాలికఁ దోఁచునబ్బురపు ♦ మబ్బులయుబ్బులు గుబ్బతిల్లఁగన్. 157

క. మహనీయమధుర్ఝురీసం
గ్రహమునఁ గాలువలు వఱపి ♦ గనిమలుగ రజం
బహరహము నెఱపి మాకున్
సహకారము లయ్యె నచటి ♦ సహకారంబుల్. 158



మ. బలుక్రంపుటనంటికప్పురపుఁది ♦ ప్పల్ గప్పి యుప్పొంగుజా
ల్గలగొజ్జంగలనీరు సజ్జకపుఁగే ♦ ళాకూళికిం డిగ్గి త
జ్జలసూత్రంబులు వ్రాఁకి తుంపురులుగా ♦ జాఱున్ నిదాఘాంశునా
వళి వీడ్కొన్నతమంబు గాంచి వనిలో ♦ వర్తించుమంచో యనన్. 159

శా. ఆయారమ్ములఁ బొల్చుకొమ్మలబెడం ♦ గాపల్లవశ్రేణిరం
గాయాతావుల మించుపూఁబరపు లా ♦ హా యెన్నఁగా శక్యమే
యాయుద్యానముసాటి చైత్రరథ మె ♦ ట్లౌ నాయతశ్రీయుతం
బై యొక్కొక్కనగంబె చైత్రరథ మై ♦ యందున్ విజృంభింపఁగన్. 160

సీ. ఇమ్ము లై మరుహజా ♦ రమ్ము లై పొద లుండ, పూఁజవికెలు వేరె ♦ పూనవలదు
తెప్ప లై నెత్తావి ♦ కుప్ప లై పుప్పొళ్లు, రల గందపొడి త్రోవఁ ♦ జిలుకవలదు
సార మై హిమజలా ♦ సార మై పూఁదేనె, నెరయ గేళాకూళి ♦ నింపవలదు
మొత్త మై మారుతా ♦ యత్త మై గంబూర, మెగయ వితానముల్ ♦ బిగియవలదు
తే. స్వామి యారామశుభవైభ ♦ వములు సూడ
నెపుడు విచ్చేయుదురొ యంచు ♦ నెదురుసూచు
సహజసౌభాగ్యములు గూర్చు ♦ చైత్రుఁ డతఁడు
గూర్మి భవదీయవనపాల ♦ కుండు గాఁడె. 161

## హరిశ్చంద్ర నలోపాఖ్యానము ✿

### ప్రథమద్వితీయాశ్వాసములు.

(హరిశ్చంద్రోపాఖ్యానము:—ఒక్కనాఁ డింద్రుండు స్వర్గంబునఁ బేరోలగం బుండి యందుండుమునులం గాంచి యేమహాత్ముం డప్రతిమానసత్యవైభవాఢ్యుం డని యడుగ వసిష్ఠుండు సూర్యవంశసంభవుం డగు హరిశ్చంద్రుం డని పలికె. అమ్మాటలకు విశ్వామిత్రుండు గినిసి వసిష్ఠునితోడఁ గలహించె. అట్టియెడ నమ్మహర్షు లిద్దఱును ప్రతిజ్ఞలు గావించిరి. ఇంద్రసభలోనివారందఱును సభను విడిచి పోయిరి. తదనంతరంబు.

నలోపాఖ్యానము:— నిషధేశ్వరుం డగునలుండు దమయంతిసౌందర్యాదుల వినుచు దానియం దత్యంతానురాగము గలవాఁ డై యన్యచింత

✿హరిశ్చంద్రనలోపాఖ్యానమును రచియించినవాఁడు రామరాజభూషణుఁడు. 42 వపుటలోనిటిప్పణిచూచునది. మొట్టమొదట ద్వ్యర్థికావ్యంబు రచియించినవాఁడు

దొఱంగి యుండె. దమయంతియుఁ దనతండ్రి యయినభీమునికొల్వు
కూటంబున నలునిగుణవిశేషంబుల మును లభివర్ణింపఁగా విని యతనియం
దధికాభిలాషంబు గల్గివర్తించుచు యౌవనంబునం బొంది విరహవేదనచే
మిక్కిలి కృశించి మన్మథాదులకు భయంపడుచుండె నంత.)

సీ. చైత్రికుం డై రాగ ♦ సామగ్రి నెఱపి త,పస్యాంత మై ఫల ♦ ప్రాప్తి నడరి
మధు వై నవామోద ♦ మహిమఁ దార్కొని కాల,గురు వై యశేషాధ్వ ♦ గులఁ గలంచి
సుమనఃప్రసూతి యై ♦ శుకలీలఁ దనరి మా,ధవుఁ డై పలాశభే ♦ దన మొనర్చి
యామని యై భూజ ♦ నైకదుర్గతిఁ బాపి,సురభి యై హరిహర ♦ స్ఫురణ మెలఁగి
తే సారసవనప్రయోక్త యై ♦ సకలవిప్ర, వరశుభప్రదనానాన ♦ వముల నెసఁగి
యవని నలరె వసంత మ ♦ త్యంతమధుర, పంచమస్వరపూర్ణతా ♦ భవ్య మగుచు. 162

ఉ. పంచమశుద్ధి గల్గునెడ ♦ భావిఫలోదయధన్య లై లతా
చంచలలోచనల్ ప్రసవ ♦ సంపద పెంపు వహింపఁగా విజృం
భించుతదీయలక్ష్మిఁ దెలి ♦ పెన్ సకలాంగమపారగద్విజా
భ్యంచితపక్షపాతకలి ♦ తాతివినూతనజాతపత్త్రముల్. 163

ఉ. పూని మహావనీవలయ ♦ పోషణభార మపారవిక్రమ
శ్రీనిధి మాధవుం డవత ♦ రించిన నేయెడ జాతిసంకరం
బూనక పూర్ణకామ మయి ♦ యొప్పె జగంబు సదాసవానుసం
ధానపరాయణద్విజగ ♦ ణంబున కబ్బె నభీప్సితార్థముల్. 164

మ. తనమిత్రుండు మహావనప్రియబలా ♦ ధారుండు విశ్వాతిమో
హనవల్లీవలయైకజాలకకరుం ♦ డై రా మృగవ్యాప్తి నే

---

వేములవాడభీమకవి యని చెప్పంబడియెం గాని యతనిరాఘవపాండవీయము నామావ
శిష్టంబ యయియున్నది. ద్వ్యర్థికావ్యంబు నిజంబుగ వ్రాసినవాఁడు పింగళిసూరన. తాదృశ
గ్రంథంబు రాఘవపాండవీయంబు. తెలుఁగునఁ దక్కుంగలద్వ్యర్థికావ్యములు తిరుమల
బుక్కపట్టణవేంకటాచార్యకృత మయినయచలాత్మజాపరిణయంబు శ్రీపాదవేంకటాచల
కవికృత మగురామకృష్ణోపాఖ్యానంబు లోనగునవి. నెల్లూరిరాఘవకవిప్రణీత మైనయొక
యాదవరాఘవపాండవీయమును, నెలకూచిబాలసరస్వతివిరచిత మైనమఱియొకయాదవ
రాఘవపాండవీయమును, త్ర్యర్థికావ్యము లయి విలసిల్లుచున్నవి.



చినపాత్రీనపులిందమాళి దనకుం ♦ జేదోడుగాఁ బూనెఁ బ
చ్చనివిల్ శంబరవైరి యధ్వగమృగే ♦ ష్వావిర్భ్రమాపాది యై. 165

సీ. సరసధారావికా ♦ సప్రసవంబు లై, యెసఁగుమావుల నెన్ని ♦ యేని మనిపి
ప్రకటగంధాంధపు ♦ ష్పంధయావృతము లై, యలరుపున్నాగకో ♦ టుల నమర్చి
చక్రచంక్రమణవా ♦ చాలలీలఁ జెలంగు, పటుపత్త్రరథపరం ♦ పరలఁ గూర్చి
చండాంశునూతన ♦ మండలాగ్రస్ఫూర్తిఁ, దనరారు దళముల ♦ తఱచుఁ బేఁచి
తే. చిత్రపత్త్రముఖోజ్జ్వల ♦ శ్రీలఁ దగున, పారశరజాతములు నించి ♦ పరమమైత్రి
నెఱపునామనిపడవాలు ♦ నేర్పుకలిమి, జగముల జయించెఁ బ్రద్యుమ్ను ♦ చక్రవర్తి.

మ. అలరంజేసి నితాంతనూతనలతాం ♦ గాశ్లేషముల్ సల్పు ని
శ్చలలీలన్ మధుపాంగనాసమితికిన్ ♦ సంధించుఁ దామ్రాక్షి యా
కలకంఠిం బలికించు నేర్పన భుజం ♦ గగ్రామధామైకసం
కలనాభ్యాసవిలాసపాటవమునన్ ♦ గంధానిలాంకూరముల్. 167

సీ. అతిముక్తపంక్తికి ♦ నతులితామోదమ్ము, ద్వీకామితాశ్లేష ♦ వృత్తి గలిగె
శుకముఖద్విజరాజి ♦ కకలంకవిలసన, శ్యామావిహారకా ♦ శలము గలిగె
గురువిభవాశోక ♦ కోటికి నభినవ, ప్రమదాళిరాగమై ♦ భవము గలిగెఁ
బరమహంసోత్తమ ♦ ప్రతతి క్షపతిమాన, పద్మినీరసనిగుం ♦ భనము గలిగె
తే. నఖిలభువనైకమోహకుం ♦ డైనమాధ, వునకు నీవనవాసిరం ♦ జన మయత్న
కార్యలేశంబు సు మ్మంచుఁ ♦ గమ్మగాడ్పు, గడిమి మ్రోయించెఁ గలకంఠ ♦ కంఠఘంట.

చ. చిగురుమెఱుంగుసంజలును ♦ జిక్కనిక్రొన్ననచుక్కగుంపు లిం
పగుపువురెమ్మక్రొన్నెలలు ♦ నచ్చపుఁబుప్పొడి చిన్నివెన్నెల
ల్లగనతలంబుఁ గప్ప నఖి ♦ లక్షణదాభ్యుదయంబు లయ్యె నే
వగఁ బగ లూనెనో సురభి ♦ వైభవముల్ పథికాంగనాళికిన్. 169

## చంద్రభానుచరిత్రము ❁
### తృతీయాశ్వాసము.

చంద్రభానుం డనుసత్యాసూనుండు గుండినగరంబున కరిగి యం దున్న
తుంబురుసమీపంబున శిష్యత్వంబు వహించి రుక్మబాహునృపతనయుతో
విపంచికం /అచుచుండె.)

---

❁ చంద్ర ,చరిత్రంబును రచియించినకవి తఱిగొప్పులమల్లన. ఇతఁడు దత్తాత్రేయ
యోగీంద్రుని సేవించి తత్ప్రసాదంబునంజేసి కవిత్వవైభవంబు వడసినవాఁడు. ఇతని

ఉ. అంతదిగంతదంతురల ♦ తాంతనిశాంతనితాంతకాంతవ
న్యాంతికతాంతపాంథజన ♦ తాంతరనంతతకృంతనప్రథా
త్యంతసమంతతస్స్ఫురదు ♦ దంతపరంతపకాంతిసంతతి
క్రాంతదురంతకుంతరతి ♦ కాంతము వొల్చె వసంత మెంతయున్. 170

ఉ. పూని వసంతపాలికుఁడు ♦ పొంగెడు రాగరసంబుచేఁ గడు
స్నానుగ నాన్చి మానవపు ♦ నట్టులు దున్ని మనోజకందళిం
గానఁగఁ జేసి యంత నెగఁ ♦ గట్టినయట్టిహలంబులో యనం
గా నెఱసెం బలాశకలి ♦ కల్ మునుమున్న వనాంతరంబునన్. 171

క. ఎలదీవెచెలులు వలిగా, డ్పులపైఁ దేనియవసంత ♦ ములు సల్లఁగఁ జే
తులఁ బూనిన నేత్రపుఁది, ట్టులు నాఁ దలిరాకుఁబొదలఁ ♦ దోఁచెన్ మొగ్గల్. 172

ఉ. మావుల మారుక్రొంజిలుక ♦ మావులవిద్దియ దిద్ది గందపుం
దావుల గాడ్పుసాహిణి ల ♦ తాకశ పూని మిళిందయుక్తమా
లేవిరిక త్తిగిల్కఁ గద ♦ లించుచు ధే యని కూఁత వైచె నా
నావిధపల్లవాశనక ♦ నత్కలకంఠకుహూరవార్భటిన్. 173

ఉ. ఆలమునం దిశల్ గెలిచి ♦ యాడఁగఁబోవ వియుక్తరక్తముల్
హాళిని నుట్టి పూవుఁబొద ♦ లన్బలుదోనుల నించి చిల్కతే
జీలకుఁ జూపఁ బోలు నన ♦ సింగిణిజో దటుగాక యున్నతో
నేల వహించుఁ గెంపుజిగి ♦ నీకదళీసుమకీరతుండముల్. 174

సీ. శాపనివృత్తికై ♦ చనుదెంచువెడవేల్పు, రాచత్రాఁ చన భృంగ ♦ రాజి దనర
సంగడికాస్త్రీముల్ ♦ నదివెడుశిష్యుల, చెలువునఁ గెలయుకో ♦ యిలలు సెలఁగ
విన్నం దనకు మన ♦ వికి డాయువింధ్యశృంగములు నాఁ బుప్పొడి ♦ గట్టు లెసఁగఁ
గట్టినకావిశో ♦ కలచెఱుంగులరీతి, నెడనెడఁ దలిరాకు ♦ లెగసియాడ

తే. నెలమిఁ దనుఁ గన్న ద్విజపంక్తు ♦ లెదురుకొనఁగ
పారెఁ బెల్లుబ్బి యువజన ♦ శ్రమజలాబ్ధి
నిముడుకొని దక్షిణము వాసి ♦ యేఁగుదెంచెఁ
గొదుకునడతోడఁ బవమాన ♦ కుంభజుండు. 175

---

కవిత్వము రసయుక్తమై మనోహరమై యుండును. ఈతఁడు శ[illegible]ణశకము 1585వ సంవత్సరమునకును 1614వ సంవత్సరమునకును నడుమ నీగ్రంథము రచియించినాఁడు.



## పాండురంగమాహాత్మ్యము ॥

### చతుర్థాశ్వాసము.

(రాధ మాధవుం దనకు నధినాథుంగాఁ గోరి గోవర్ధనధరాధరసమీపవర్తి యగు ఋణవిమోచనతీర్థంబునం దపంబు గావించుచుండ శిశిరంబు గడచె.)

క. అంత వసంతము జితహే
మంతము దీపించి మత్త ♦ మధుకరకలభా
క్రాంత మురుపుష్పరసవే
శంతము సకలద్రుములఁ బి ♦ సాళము చెలఁగెన్. 176

ఉ. కెంజిగురాకుడాలు దుల ♦ కించినధాతుపటంబుచాయఁ జే
యం జదురెక్కుపుప్పొడుల ♦ నంటిన తేఁటులు భూతిభృజ్జటా
పుంజముఁ బోలఁగా విపిన ♦ భూములలో మధులక్ష్మి పొల్చె నీ
లాంజనవర్ణుఁ గోరి తప ♦ మట్లొనరించుమృగాక్షికై వడిన్.

---

ఈ పాండురంగమాహాత్మ్యము తెనాలి రామకృష్ణకవిచే రచియింపంబడినది. ఈ రామకృష్ణకవి పదునాఱవశతాబ్దాంతమునం దున్నవాఁడు. ఇతనినివాసస్థలము కృష్ణామండలమునందలి తెనాలియగ్రహారము. ఈతనిపూర్వులు కాఁపురము చేసినతావు తెనాలికి రెండుకోసులదూరమం దున్న గార్లపాడుగ్రామ మనియు, నితఁ డక్కడనుండి తెనాలికి వచ్చి కాఁపురము చేరె ననియుఁ జెప్పుదురు. ఇతండు బాల్యంబునయప్పుడు బట్టుపల్లె యను నట్టిగ్రామంబునం దుండుబట్టురాజులతోఁ జెలిమి సేసి, తత్సాంగత్యంబున సంస్కృతాంధ్రసాహిత్యమును గవిత్వకౌశలంబును సంపాదించి, తనబుద్ధిబలముచేఁ బ్రబంధకవీశ్వరతం గాంచి వన్నెకెక్కె నని చెప్పుదురు. ఇతనికవిత్వంబునందలివర్ణనంబులు రమ్యంబులయి యుండును. పాండురంగవిభునిపదగుంభనంబు నని చెప్పిన ట్లీతనికవిత మేలిమాటల కూర్పుచే నెంతయు విలసిల్లుచుండు. అందు వాక్యరచనయు భిన్నభిన్నవిధంబుల నొప్పి నిరర్థకపదాపేతం బై యుండు. పాండురంగమాహాత్మ్యమునకే పాండురంగవిజయ మను నామాంతరంబు గలదు. పాండురంగవిజయ మను పేర రామకృష్ణకవివిరచిత మైనమఱి యొకగ్రంథ మున్నదని కొందఱు నుడువుదురు, గాని యయ్యది విశ్వాసార్హంబు గాదు. ఈకవి యుందుధరోపాఖ్యాన మనునట్టి గ్రంథంబును గూడ రచియించినట్లు తెలియ వచ్చుచున్నది.

## వైజయంతీవిలాసము *

### ప్రథమాశ్వాసము.

(మండగుడి యనునట్టియగ్రహారంబున వసించుచుండిననారాయణాభిధానుని కుమారుం డైనవిప్రనారాయణుం డనుబ్రాహ్మణుండు వైష్ణవాచారసంపన్నుం డై భగవదష్టాక్షరీమంత్రజపపరాయణుం డయి కాలంబు గడపుచు దేవార్చనానిమిత్తంబు దా నొకపూఁదోఁట పెట్టించి దానిం బ్రోదిసేయుచు నుండె.)

క. శ్రీధరసేవారతుఁ డగు
నాధరణీసురునితోడ • నలరించుటకై
సాధుగతి వచ్చెనో యన
మాధవుఁ డేతెంచె వసర • మాధవుఁ డంతన్. 178

మదనప్రతాపాగ్ని • మంజరుల్ ప్రోలె శే, మావులఁ జిగురుజొం • పములు వోలిచె
ననమాయుధునికీర్తి • ననలకై వడి మల్లి, కాకుంజవితతి మొ • గ్గలు దనర్చె
స్మరగజకర్ణచా • మరము లై పున్నాగ, ములఁ బ్రసూనగుళుచ్ఛ • ములు ఘటిల్లె
జలజాస్త్రబలరేణు • వులు నాఁగ సంపెఁగ, గమి మరుద్గతపరా • గములు నెఁ

తే. కుసుమబాణసునాసీర • ఘోషమాణ, కాహళీశంఖతుత్తుంభి • కలతెలుంగు
దాల్చె నానావనీరుహ • ధ్వనదుదార, కీరకలకంఠసమదభృం • గీకులంబు. 179

సీ. అంగజకృతాంత • రంగజాయాకాంత, ఘోరవ్యాయవ్యకిం • శారుతములు
జరదురంగమపరి • స్ఫురదుపహ్వారగిరి, స్వైరసంచారని • ర్భరుతములు
స్మరసమీకస్విన్న • నరసమాహూత్పన్న, ఘోరిఘుర్మాంభళ్ళ • రారుతములు
పథికమర్దనమహా • రథికమన్మథసహా, యోరువీరవిహార • చారుతములు

తే. హారిగతి నంచరించెఁ గా • వేరికాప్ర, తీరసారసకమలక • హ్లారకుముద
సారసౌరభ్యసంభార • భారవహన, మారపరిచారమధుమాస • మారుతములు. 180

---

* సారంగుతమ్మయ్య యనునాతఁడు విప్రనారాయణచరిత్రం బనునామాంతరంబు గల యీవైజయంతీవిలాసమును రచియించెను. విప్రనారాయణునకే తొండరడిప్పొడి యాళ్వారని ద్రావిడనామము. ఈతమ్మయ్యకవిత్వంబు మనోజ్ఞ మై యుండును గాని యిందుఁ గవిత్రయంబువారిప్రయోగంబులకు విరుద్ధంబు లైనప్రయోగంబులు గానంబడుచున్నవి. హూణశకము 1581వసంవత్సరమునకును 1611వసంవత్సరమునకును మధ్యకాలమందు వైజయంతీవిలాసము రచియింపఁబడెను.

180. మారుతములు 91,123, ఈరెండుపద్యంబులందును వర్ణింపఁబడి యున్నవి.



వ. అప్పుడు వన్యాభిరామంబులు, వర్ధితయామంబులు, వాచాలశుకపికస్తోమంబులు, పలమానభృంగంబులు, వాహ్యాళివిహారదనంగంబులు, వర్తిష్ణుమలయపవమానంబులు, వర్జితజాతిప్రసూనంబులు, వాసితలతావితానంబులు, వల్గత్పరాగధూసరంబులు నై యమ్మధుమాసవాసరంబు లొప్పె. 161



## చారుచంద్రోదయము *

### చతుర్థాశ్వాసము.

(శ్రీకృష్ణునకు వైదర్భియందు నిజకాంతిజితచంద్రుం డయినచారుచంద్రుం డను కొమరుం డుదయించి సమస్తవిద్యలం దేఱి వర్ధిల్లుచు నొకతఱి రైవతకాద్రియందు విహరించుచు నొక్కకోనం గని యందున్నయొకపుష్పాడితిన్నియం గూర్చుండ, శాంతభూషణుం డను పేర వెలయుసిద్ధుం డొకరుండు వచ్చి మానసోత్తరభూధరంబు దా నాశ్రయించి యుండఁ బుష్కరుం డను రక్కసుండు దన్ను బాధించుచున్నాఁ డతనిం జంపు మని యభ్యర్థించె. అంతఁ జారుచంద్రుం డారక్కసుం ద్రుంచిన నాతని కాసిద్ధుండు త్రికాలవేది యనుకీరరాజంబును బసదనంబుగ నొసంగిన దానిం గొని దానివలన నొకభావిశుభంబు తెలియఁ గోరి యడిగిన నాశుకంబు చారుచంద్రుం జూచి యిట్లనియె. వింధ్యసవిధంబున రత్నకేతనపురంబునం బద్మాకరుం డను భూవరునకుఁ గలభాషిణి యనుభార్య యొప్పు. ఆపద్మాకరుఁడు సంతానంబునకై విష్ణుంగూర్చి తపం బొనరించె. అట్టులు పద్మాకరుఁడు తపం బొనరించుచుండ నాకనాథుండుశశిరేఖం బిలిచి యాతనితపోవిఘ్నం బొనరింప నియోగించుడు శశిరేఖాద్యప్సరఃకాంతలు భూమికి దిగి వచ్చి యాతనితపోమహిమంబునంజేసి చెంతం జేర భీరువులై పాకారి కారీతి యెఱింగించిరి. అంతఁ బద్మాకరునకుఁ బద్మావల్లభుండు సాక్షాత్కరించి యభీష్టవరం బొసంగిన నారాజు తనయూరికరుదెంచి కొంతకాలంబునఁ దనభార్యయందుఁ బుట్టినకుమారునకు మకరధ్వజుం డనియుఁ గుమారికకుఁ గుముద్వతి యనియుఁ బేరిడి పెంచుచుండ సుముద్వతి మిక్కిలి యందగత్తెయై యొప్పుచున్నది. యన్నాతి నీకుం దగి యున్నది యనఁ జారుచంద్రుం డాచిలుక నాచెలువపాలికి ననుపఁ బోయి యాయనసౌందర్యంబును గుముద్వతికి వర్ణించి చెప్పె. ఆవల నావెలఁది యారుక్మిణీనందనుం దలఁచి తలఁచి మరులుగొనుచుండె.)

---

* నందవరీకకులోద్భవుఁ డైనచెన్నమరాజు చారుచంద్రోదయం బనం బరఁగు నీగ్రంథంబును రచియించె. ఇతండు తాడిపత్రియందు విలసిల్లునట్టి గోపాలకృష్ణస్వామి

చ. తనరె వసంత మంతట ని ♦ తాంతలతాంతనిశాంతమీనకే
తనరణతాంతకాంతవని ♦ తాజనతాతనుతాపరూపథం
జనచణసారసౌరభవి ♦ సారసమీరకిశోరవారన
ర్తనదళదంబుజాతమిళి ♦ తభ్రమరభ్రమరీతరంగ మై. 182

చ. జలదము పాదునీటఁ దమ ♦ సంతతముల్ మను పుచ్చుకొన్న య
ప్పులకయి యడ్డగింప ఫల ♦ పుష్పము లయ్యెడ నేమి లేమి వా
టిల గతి లేక పత్త్రము లి ♦ డెం దరుకోటి యనంగ సంతతా
నిలహతిఁ బండుటాకుగమి ♦ నిండె నభోంగణసీమ నామనిన్. 183

సీ. క్ష్మారాజఫణిరాజ ♦ శాఖాఫణవ్రాత, సముదగ్రతరమణి ♦ సముదయంబు
ఘనపాదపానీక ♦ కందర్పకుంభీంద్ర, గురుధాతుచర్చాని ♦ గుంఫనంబు
వసుధారుహవ్యూహ ♦ వనదేవతాభవ్య, సౌధపట్టపట ♦ ధ్వజవ్రజంబు
బంధురానోకహ ♦ ప్రావృషేణ్యపయోద, నిర్ణిద్రసౌదామ ♦ నీచయంబు.
తే. వరవయోహృద్యనిరవద్య ♦ వల్లరీవ, ధూనమాశ్లేషమోదనా ♦ భానమాన
విటపపటుకుంకుమాలేప ♦ విలసనంబు, తలిరుజొంపంబు వసుల నెంతయుఁ దనర్చె.

చ. అళికలభేంద్రనీలమణి ♦ హారములున్ సుమమంజరీతలం
బులు చలియింపఁగాఁ జిగురుఁ ♦ బొంకపుబింకపుఁగేలు ద్రిప్పుచున్
మలయసమీరనర్తకుఁడు ♦ మాటికి మాటికి హెచ్చరింపఁగాఁ
దలిరుమిటారిప్రాయపుల ♦ తావనితల్ నటియించి రింపునన్. 185

మ. సొబ గొందన్ సుమసీధు వానిటసువుల్ ♦ సొల్పొందఁగా లాహిరిన్
జబులై పుప్పొడిఁ బచ్చ లౌపుతకచాల్ ♦ సంజాతముల్ సేసి వే

---

యనుగ్రహంబునంజేసి కవిత్వసిద్ధి వడసినవాఁడు. ఇక్కవి హూణశకము 1574వ సంవత్సరమునకును 1614వసంవత్సరమునకును మధ్యకాలమునఁ బ్రబలియున్నవాఁడు.

183. అప్పులకై పత్త్రములు వ్రాసి యిచ్చులోకమర్యాద యిందు స్ఫురించుచున్నది.

184. ఇచ్చట చిగురాకు పలుతెఱంగులైనయెఱ్ఱదాలువస్త్రువులయి యున్నట్లు 46వ, 115వపద్యములయందును జెప్పంబడియె.

185. ఇందు లతావనితలు నటియించినట్లు వ్రాయంబడియె. 143వ పద్యమునందుఁ గలవర్ణనమునకును నిందలిదానికిని భేదము చూచునది.



ద్కబడిం జిల్కకళాసులం జులుకగాఁ ♦ గావించునమ్మారుబల్
హబిసీరౌతు లనంగఁ దుమ్మెదలు సొం ♦ పారెన్ వనీవీథులన్. 186

సీ. తనివుఁదేనియల్ ♦ దనివి దీఱఁగఁ గ్రోలి, చెలరేఁగి గానముల్ ♦ సేయువళులు
నతిసౌరభాంకురం ♦ బాకంతముగ మేసి, క్రొవ్వి కూఁకలువెట్టు ♦ కోకిలములు
లలితమాధుర్యస ♦ త్ఫలరసంబులు ద్రావి, కలకలంబులు సేయు ♦ చిలుకగములు
ఛాయాతరుచ్ఛాయ ♦ జలదమాలిక యంచు, సారె నర్తించుమ ♦ యూరతతులు
తే. నవనవామోదభరితనా ♦ నాప్రదీప్త, భూజరాజాసమమరంద ♦ రాజి రాఁజి
మలయనిలయానిలాంకూర ♦ మహితమహిత, నిత్యశైత్యా వసుల్ వసుల్ ♦ నెగడెనపుడు.

## చమత్కారమంజరి. ✠

### ప్రథమాశ్వాసము.

(సమస్తసంపదలకుఁ బ్రాపయి తనరారుద్వారకాపురంబుయదుపుంగవుండైన శ్రీకృష్ణుం డేలుచు వివిధమహోత్సవంబులం దవిలి వర్తిల్లుచుండె.)

ఉ. అంతటఁ బండి పచ్చపచ ♦ నైనదళంబులు రాలెఁ దద్వన
ప్రాంతములన్ ఫలం బిడున ♦ మర్థతతో మధుమాసలక్ష్మి తా
నెంతయు వేడ్క రా నలమ ♦ హీరుహదేవత పచ్చబట్టలన్
వింతలుగాఁ బదంబులకు ♦ వేగముతో మడుఁ గిచ్చురంగునన్. 188

మ. చెలు వారంగఁ బలాశభూజములు పూ ♦ చెన్ మానవౌఘంబు త
త్కలికారాజికిఁ జిల్కముక్కుల కభి ♦ ఖ్యాతారతమ్యక్రమం
బులు చర్చించుచుఁ జిల్క లెంత యనఁ ద ♦ న్మూలంబుగాఁ బొంక మై
పొలుపొందెన్ ధరఁ గింశుకంబు లనఁ ద ♦ న్మూజంబు లన్వర్థతన్. 189

---

✠ చమత్కారమంజరికి లక్షణావివాహం బని నామాంతరంబు గలదు. ఇయ్యది సింహాద్రివేంకటాచార్యునిచే రచియింపఁబడియె. ఇతఁడు భద్రాచలరామభద్రు నిష్టదైవంబుగా వర్ణించుటచే నీవేంకటాచార్యుఁడు గోదావరిమండలములో నివాఁడనిభావింపవలయు. ఈతనికవిత్వంబు ప్రౌఢంబై యుండును గాని యిం దక్కడక్కడ వ్యాకరణవిరుద్ధంబు లయినప్రయోగంబులు గానంబడుచున్నవి. అప్పకవికిఁ బూర్వంబున నున్న లాక్షణికు లెవ్వరు నీతనిగ్రంథముం జేకొనక యుండుటంజేసి యీకవి హూణశకము 1630, 1640, సంవత్సరప్రాంతములం దుండి యుండవచ్చును.

189. ఇందుఁ గింశుకము లనునామమునకు వ్యుత్పత్త్యర్థము కల్పింపబడి యున్నది గాన నిందలియలంకారము నిరుక్తి.

తే. పత్త్రిపుష్పఫలరసనం ♦ పదలు వేఁడె
ధరణి నమ్మాధవుఁడు ఘన ♦ తరుల నెల్ల
పత్త్రిపుష్పఫలరసనం ♦ పద లొసంగె
ధరణి నమ్మాధవుఁడు ఘన ♦ తరుల కెల్ల. 190

తే. పరఁగ విటపాళిఁ గూడియు ♦ బహుపలాశ
మయ్యు నెంతయు బహుకోశ ♦ హారి యయ్యు
భూజసంఘంబు సుమనోవి ♦ భుత్వ మొందె
నహహ మాధవసేవ ని ♦ రర్థ మగునె. 191

సీ. ఘనత రాగావృత్తిఁ ♦ గని నారదాభిఖ్య, నదలించువిమలగా ♦ త్రాళులకును
శ్రుతియోగ్యవాగ్వైఖ ♦ రులఁ జెలంగెడుసుర, సవనప్రియద్విజ ♦ సంఘమునకు
మెచ్చ నవరసాల ♦ మృదులతాపద్ధతిఁ, దవిలి పల్కెడునాళు ♦ కవితతులకు
మహిఁ బల్లవాలోక ♦ మంజులాస్యస్ఫూర్తిఁ, గలయువనాటుల ♦ గణములకును
తే. నందడిలి వేడ్క బలుమక ♦ రందవాహ, ములు సహాహారభూరిస ♦ ముజ్జ్వలప్ర
వాళము లభీష్టఫలములు ♦ నోలి నొసఁగి,యావసంతంబు రతిరాజు ♦ కీవి నెఱపె.

## భానుమతీపరిణయము *

### ద్వితీయాశ్వాసము.

(ద్వారకాపురంబున శ్రీకృష్ణునకుఁ బినతండ్రి యైనభానుం డనుయదుకుంజరుం డొక్కఁ డుండె. అతనికి భానుమతి యనునొక్కకన్నియ జనియించి రూపలావణ్యరేఖల నెంతయు సొంపు మీఱి తల్లిదండ్రుల కత్యంతంబు ముద్దుగొల్పుచుఁ బెరుఁగుచుఁ గ్రమక్రమంబున సంప్రాప్తయౌవన యై భువనమోహనసౌందర్య విశేషంబున నొప్పుచుండె. అట్టియెడ శ్రీకృష్ణుండు దనసేవకు వచ్చిననారదుం జూచి రుక్మిణీసత్యభామలతోడ నున్నభానుమతిం జూపి యీరమణి నేరికి నియ్యఁదగు నని యడిగిన నియ్యేలనాఁగకు సహదేవుండ తగువాఁ డని యవ్వేల్పుఁదపసి నుడివె; అది వినినకోలె భానుమతియు సహదేవునియందు మిక్కిలియనురాగంబు గల్గి వర్తిల్లుచుండె.)

---

* భానుమతీపరిణయంబును రచియించినవాఁడు రెంటూరి రంగరాజు. ఇతని కవిత్వంబు ద్రాక్షాపాకప్రాయ మై మనోజ్ఞ మై యుండును. భానుమతీపరిణయంబు హూణశకము 1610వ సంవత్సరంబుప్రాంతమున విరచింపఁబడినయది.



ఉ. అంత వసంతకాలము న ♦ మంచితసాలము కోకిలారవా
క్రాంతదిగంతరాళము శు ♦ కప్రియలీలము మత్తభృంగవి
భ్రాంతలతాంతజాలము ప ♦ రాగవిశాలము పాంథకామినీ
కాంతమనోవిదారము జ ♦ గత్త్రియమోహనలీలఁ దోఁచినన్. 193

సీ. బలితంపుగుత్తుల ♦ పై రజంబులు రాలఁ, జిలికినకస్తూరి ♦ చెలువు మీఱ
మెఱుఁ గారుకొదమతు ♦ మ్మెదకురుల్ చెదరంగ, విరిసినవపత్త్రి ♦ విధము లెసఁగఁ
గమ్మనియూర్పులఁ ♦ దెమ్మెరల్ నిగుడంగ, ననతేనెచెమటసో ♦ నలు చెలంగ
లలి రత్నకళికావ ♦ ళులు పెనఁగొని యుండఁ, బారావతధ్వని ♦ పంతు మెఱయఁ
తే. దళుకుఁగెమ్మోవి పంటిరే ♦ ఖలఁ దలిర్ప, భుజలతాలింగనంబునఁ ♦ బొసఁగ మదన
కేళి సలుపును వనదేవ ♦ తాలతాంగి, శుభ మెలర్ప వసంతవ ♦ ల్లభునిఁ గూడి. 194

చ. పరిసరవృక్షమూలములఁ ♦ బట్టినమవ్వపుఁబువ్వుఁదీవెలం
బరఁగినగుజ్జుకెంజిగురు ♦ మావులఁ గన్గొన నొప్పు నెంతయున్
విరహుల గెల్వ వచ్చు నన ♦ విల్తుఁ డటంచు వసంతవాహినీ
శ్వరుఁ డలరించు కొందలుకుఁ ♦ జందురుకావికుడారులో యనన్. 195

సీ. చికిలికెంపులఁ బోలు ♦ చిగురుటాకులడాలు, చెంగావిచందువా ♦ చెలువు గాఁగ
హరినీలములపెంపు ♦ నలరుతుమ్మెదగుంపు, పర్వినయగరుధూ ♦ పంబు గాఁగ
ముత్యాలజిగిఁ గుల్కు ♦ మొల్లమొగ్గలతళ్కు, రంగవల్లికలబె ♦ డంగు గాఁగ
గరుడిపచ్చలఁ గేరు ♦ కల్కిచిల్కలబారు, పచ్చనితోరణ ♦ పంక్తి గాఁగ
తే. మలయమారుత మేతెంచు ♦ తలిరుటాకు, గములనందులు సోరణ ♦ గండ్లు గాఁగఁ
జైత్రుఁ డోలగ మై యున్న ♦ సదన మనఁగ, మవ్వ మిగుకొత్త గుజ్జులే ♦ మావి దనరు.

సీ. నిగనిగమనఁ దూలు ♦ నిండుచెంగావితో, విడ జాతి ముడిగొన్న ♦ విరులతోడ
నొఱ పైనమెఱుఁగుగో ♦ రొత్తునందులతోడ, రాలు చుండెడుగంధ ♦ రజముతోడ
నెలమిఁ బైకొని చుట్టు ♦ నెనయుకొమ్మలతోడ, నెఱకెంపుఁబండ్లవ ♦ న్నియలతోడఁ
గలకంఠులకుఁ జూడఁ ♦ జెలు వైనవగతోడ, వలనొప్పువెలిమించు ♦ వలువతోడఁ
తే. జాల వినుతింప రాణించు ♦ సకలలోక, మోహనాకారగతులతో ♦ మొనసి వేడ్క
నెంచఁ దగుక్రియఁ గతు విజృం ♦ భించి యొక్క,బాలపల్లవసహకార ♦ పతి నెలంగె.

---

195, 196, 197. మామిడిచెట్టు 195వపద్యమునందు గుడారుగాను, 196వపద్యమునందు మన్మథునికొల్వుకూటముగాను, 197 వపద్యమునందు విటపతిగాను, వర్ణింపఁబడియున్నది.

మ. ఆలగంధాద్రిమరుద్భుజంగుఁడు లతా ♦ బ్జాక్షీవతంసంబు కెం
దలిరుంజందురు కావిపయ్యెద ఘనా ♦ నందంబుతో నూడ్చినం
జెలువారన్ విరిగుబ్బగుత్తులు ప్రకా ♦ శించెన్ మహానీలహా
రలతాపుంజములన్ బలెన్ మెఱసె నా ♦ రా మత్తభృంగావళుల్. 198

ఉ. బారులుదీరి పూఁబొదల ♦ పజ్జలఁ జేరి పరిభ్రమించుచుం
బేరెము వాఱి తేనియల ♦ పెల్లునఁ దేఱి లతాకుడుంగముల్
సారెకుఁ దూఱి సౌరభము ♦ జాడలఁ దాఱి పురందరోపలా
గారముఁ గేరి షట్పదని ♦ కాయము మీఱి తనర్చు నామనిన్. 199

ఉ. మూఁగి విపంచిచందమున ♦ మ్రోఁగి లతానవకుంజడోలలం
దూఁగి మరందధారలను ♦ డోఁగి మనోహరగంధలీలచే
వీఁగి సుచంపకంబు గని ♦ వేఁగి ప్రసూనగుళుచ్ఛపంక్తిలో
నీఁగి సరోవరంబులకు ♦ నేఁగి యళివ్రజ మొప్పు నామనిన్. 200

చ. సుమముల వ్రాలి వ్రాలి పరి ♦ శుద్ధవసంతకళాబ్ధిమత్తరం
గములను దేలి తేలి యతి ♦ కాంతసుధామధురోల్లసన్మరం
దముఁ బవిఁ గ్రోలి క్రోలి నవ ♦ దక్షిణగంధవహానుకూలసం
భ్రమమున సోలి సోలి మద ♦ బంభరముల్ విహరించు నామనిన్. 201

తే. పుష్పకాండవిలాసంబుఁ ♦ బూని యున్న
పృథులతరుసంగతి నటించు ♦ భృంగ మొకటి
పుష్పకాండవిలాసంబుఁ ♦ బోవ నాడుఁ
బృథులత రుసంగతి నటించు ♦ భృంగిఁ గేరి. 202

సీ. కేళీసరోవీథి ♦ నాళీకవాటీమ, ధూళీఝరీరాజిఁ ♦ దేలి తేలి
చోళీమహాభోగ ♦ మాళీనవప్రసూ, నాళీసుగంధంబు ♦ లాని యాని
లోలీభవత్పుష్ప ♦ ధూళీచరద్భృంగ, పాళీనిరోధాప్తిఁ ♦ దాళి తాళి
తాళీవనీనారి ♦ కేళీరసాలకం, కేళీహితచ్ఛాయఁ ♦ గెరలి కెరలి
తే. మెఱుఁగు నామని మణిదరీ ♦ వలయునిలయ, నిలయనందనచందనా ♦ కలితలలిత
వలితలవలీనికుంజాబ్జ ♦ వదనమదన, కదనఘర్మాపహం బైన ♦ గంధవహము. 203

---

199, 200, 201, 202. ఈపద్యములందు భృంగవిహారములు వివిధములుగా వర్ణింపఁబడియున్నవి.



## ముకుందవిలాసము ✿

### ప్రథమాశ్వాసము.

(వసుదేవునికుమారుండైనగదుం డనంబరఁగినవాఁడు కేకయేంద్రుకన్నియయయినభద్ర యనునట్టిభద్రనాగగమనం గాంచి తద్విలాసంబుల కెంతయు సంతసించి యమ్మానినీరూపరేఖావిలాసంబులఁ దనయగ్రజుం డగుశ్రీకృష్ణున కెఱింగింప నగ్గదాగ్రజుండును ననుజునివచనంబు లాలకించి యాజవ్వని నెన్నండు చూడఁగల్గునోయని యువ్విళులూరు చుండె నానమయంబున.)

సీ. సురసాలసమశీల ♦ సురసాలతరుజాల, సరసాలవాల ♦ పరిసరంబు
మలయాగతటభాగ ♦ నిలయాగమాభోగ, వలయాగతసదాగ ♦ తిలసితంబు
వనితాజనసమాజ ♦ జనితాజరమనోజ, జనతాజయవిరాజ ♦ దనునయంబు
సురతాంతసునితాంత ♦ పరితాంతసదుదంత, భరితాంతరసకాంత ♦ వరచయంబు
తే. గహనసహచరసహచరా ♦ వహితమహిత, వికచరుచికులవిచకిల ♦ సకలవకుళ
విసరమధురసమధురస ♦ దసమకుసుమ, సముదయము పొల్చె మధుమాస ♦ సముదయంబు.

సీ. వరపర్వవిస్ఫూర్తి ♦ వనరాసు లుప్పొంగెఁ, దగువిధిఁ జంద్రుఁడు ♦ తత్కర్ష మించె
ధర్మాశఁ గనె జగ ♦ త్ప్రాణధారారూఢి, యతనువైభవలీల ♦ లతిశయించె
సుమనస్సమూహముల్ ♦ సొంపుచే నింపారె, జగతి సాఫల్యంబు ♦ సంగ్రహించె
శుకముఖద్విజరాజ ♦ సూక్తులు విలసిల్లె, సారసస్థితి హంస ♦ చయము లమరె
తే. యోగివితతికి నానంద ♦ ముదయ మందె, వేడ్కఁ దను జాతిహరణప్ర ♦ వృత్తి యనుచు
సకలజనములు గణుతింప ♦ సరసరీతి, భూరిగతిఁ బొల్చు మాధవా ♦ భ్యుదయమహిమ.

శా. శ్యామాళుల్ పురుషవ్రజంబు సుమనో ♦ వ్యాప్తిన్ ఫలశ్రీలచే
నామోదింపఁగ నమ్మహావని విభుం ♦ డై మాధవుం డొప్పె నా
శ్యామాళుల్ పురుషవ్రజంబు సుమనో ♦ వ్యాప్తిన్ ఫలశ్రీలచే
నామోదింపఁగ నమ్మహావని విభుం ♦ డై మాధవుం డొప్పఁడే. 206

---

✿ భద్రాపరిణయం బని నామాంతరంబు గలముకుందవిలాసమును విరచించినకవి కాణాదపెద్దనసోమయాజి. ఇతండు సంస్కృతాంధ్రభాషలం జక్కఁగ నేర్చినవాఁడు. ఇతనిగ్రంథంబులు శబ్దాలంకారంబులచే నిండి చిత్రకవిత్వంబుల కాటపట్టై యుండు. ఈతనికవిత్వము రసవంతం బై కవిజనానందజనకం బై యొప్పారు. ఇక్కవి పదునేడవశతాబ్దాదికిఁ దరువాత నున్నవాఁడు. ఇతఁడు రచియించినమఱియొకగ్రంథ మధ్యాత్మరామాయణము.

క. పేరు వహించి వసంతుఁడు
సౌరభ్యము గాంచఁ దత్సు ♦ రవసంతతియుఁన్
సౌరభ్యము గాంచెను బళి
యారయ సత్పురుషకులము ♦ లట్టివ కావే. 207

సీ. కలరవంబులరకం ♦ బులఁ బికంబులు గేరె, రమణఁ గీరములు బే ♦ రములు వాఱెఁ
బొదలుపూఁబొదలు సం ♦ పదలసొం పలరారె, జాతభీతిని జాతి ♦ రీతిఁ దాఱెఁ
బొలుపొంద సుమబృంద ♦ ములమరందము లూరెఁ, దద్బిందువుల మిళిం ♦ దములు సేరె
మరుహేతి విరహిమ ♦ర్మముల వేమఱుఁ దూఱె, శమనదిగ్వాతపో ♦ తములు వాఱె
తే. రవి రవళిఁ దేఱెఁ బథికధై ♦ ర్యములు జాఱెఁ, దాప మేపారె జనము శీ ♦ తలము గోరె
సుమరజము గూరె వనవిహా ♦ రములు మీఱె, మాఱె శిశిరంబు బెంపారె ♦ మధుదినంబు.

ఉ. చందనశైలసానువుల ♦ సందులఁ జల్లనిమల్లికాలతా
మందిరసీమలన్ రతిసు ♦ మాళములం బయికొన్న దేవతా
మందమరాళగామినుల ♦ మైవలపుంజెమటల్ హరింపఁగాఁ
బొందుగ వీచువీవనలఁ ♦ బోలి చరించె సమీరమత్తతిన్. 209

క. హెచ్చినకూర్మి వసంతుఁడు
నెచ్చెలి యై రా బిడాన ♦ నెమ్మి నకీబుల్
హెచ్చరిక దెలుప మదనుఁడు
వచ్చెన్ జయ మంద విరహ ♦ వచ్చయమందున్. 210

క. మాకందమాకరందర
సాకరసీకరపరంప ♦ రామోదపరీ
పాకవశోన్మదమధుకర
పాకములమ్మరునినల్ల ♦ పజ యనఁ దిరిగెన్. 211

క. నెరి రెక్కకొనలు మొనలుగ
నరదళికులకములు నాయ ♦ నపుములుకులుగా
శరములసరు లగువిరులన్
మరుతూణము లనఁగఁ దనరె ♦ మధుదినవనముల్. 212

207. సురభి యనఁగా వసంతర్తువును వాసనగలదియును గాన, వసంతమును బువ్వులును సౌరభ్యమును బొందుట యుక్తమే యని యెఱుంగ నగు.



క. ఆవనములఁ గీరావలి
యావలితగతిన్ భ్రమించు ♦ నందం బలరెం
గావా దిరిగెడుమారుని
మావులు నా నపుడు నికట ♦ మండలగతులన్. 213

క. ఆవిరులు గల్లెములుగాఁ
బావనచలనంబు గమన ♦ భావముగాఁ బ
త్త్రావళి పల్యాణములుగ
మావు లమరె నపుడు మరుని ♦ మావులలీలన్. 214

సీ. పద్మిను లాసవ ♦ పరిపూర్తిచే మించి, మధుపాళి కేళికై ♦ మలయుచుండ
ఘనతరుల్ విటపసం ♦ గతులఁ జాల నెసంగి, పరలతాతనుయుక్తిఁ ♦ బరిఢవిల్ల
బహుసుమనస్తతుల్ ♦ పల్లవావళిఁ గూడి, కడకైనకొమ్మలఁ ♦ గలసి మెలఁగఁ
గూఁతఁ బంచమవృత్తి ♦ గొని వనప్రియరాజి, గణికాప్తపత్త్రిభం ♦ గము లొనర్పఁ
తే. గృతరజోవ్యాప్తి మించివా ♦ రిని గలంచి, జాతిహీనతఁ బెంచి కు ♦ జాతి నించి
యతిశయించి దపస్ఫూర్తి ♦ నపహరించి, మధువిభుం డాత్మ విభవైక ♦ మహిమఁ దెలిపె.

సీ. నిండుచల్వలు దేఱు ♦ పండువెన్నెలనీరు, చండాంశురుచితీరు ♦ సంఘటించెఁ
గలయ మెల్లన పాఱు ♦ మలయానిలముసౌరు, విలయానలముతీరు ♦ వెగటు నించెఁ
గలకలమ్ములఁ జేరు ♦ నళికులమ్ములచేరు, చిలుకుటమ్ములతీరు ♦ గలఁక మించె
మిసమిసమ్ముల మీఱు ♦ కిసలయమ్ముల మారు, నసిచయమ్ములతీరు ♦ నావహించె
తే. సంతతామోదలహరీని ♦ శాంత మగువ, సంతము దురంతకల్పాంత ♦ సమయ మయ్యె
నంత రతికాంతలతికాంత ♦ కాంతకుంత, తాంతహృదయాంత లై యున్న ♦ కాంతలకును.

చ. ధర మధుహారి లీలఁ గొనఁ ♦ దా సురసాలము పై మరుద్వరుం
డురుసుమనోదళోద్గతుల ♦ నూన్పఁగఁ గృష్ణశిలీముఖావళు
ల్మెఱసె దివిం దదీయజవ ♦ లీలఁ జనంగ నపూర్వవైఖరిం
బురిఁ గొని వచ్చి తత్తరువు ♦ పూన్చె నటం బ్రమదాశ్రయంబునన్. 217

క. కోకిలకలకలలీలల
కేకులకేకలకులాళి ♦ కిలకిలకళా

217. ఈపద్యంబున వసంతర్తువర్ణనంబే కాక పారిజాతాపహరణార్థము గూడఁ జూపట్టుచున్నది.

కాకలికేళాకూళుల
లోకాళులు కేళి కళికె ♦ లోలాకుల లై. 218

క. నవములు భూసురులకు నా
నవములు నళినివిసరములకు ♦ సరసవసంతో
త్సవములు జనులకు నతతో
త్సవములుగా నమరెఁ గుసుమ ♦ సమయముల మహిన్. 219

## రాజవాహనవిజయము. ❁

### తృతీయాశ్వాసము.

(మగధవిషయంబునందలి కుసుమపురంబు పాలించుచుండిన రాజహంసునకుఁ దదీయధర్మపత్ని యైనవసుమతియందు రాజవాహనుం డనుకొమరుం డుదయించి దినదినంబునకు శుక్లపక్షచంద్రుండునుంబోలె వర్ధిలి నిరవద్యరూపంబున నెంతయు ఖ్యాతి వహించి సమస్తవిద్యల నభ్యసించి సంప్రాప్తయౌవనుం డై యొకనాఁడు వేఁటవోయి నిఖిలమృగంబులం జెండాడి యెట్టకేలకు వేఁట సాలించి మాళవేంద్రుం డైనమానసారునుద్యానవనంబున కరిగి యందు మెలంగుచుండె.)

ఉ. జాతికిఁ జుక్కవాల్ విటప ♦ జాతికిఁ బువ్వులవాఁడు శంబరా
రాతికి నేస్తకాఁ డివపు ♦ రాతికిఁ డంకముఖంబు యామినీ
భూతికి సాంధ్యనిద్ర నల ♦ భూతికి పంచమశుద్ధి తుమ్మెదల్
వాతికి మేఁత గోరుతరు ♦ వాతికి వచ్చె వసంతుఁ డంతటన్. 220

❁ రాజవాహనవిజయమునందలియితివృత్తము దండివిరచిత మైనదశకుమారచరిత్రమునందుండి గ్రహింపఁబడినది. దీనిని వ్రాసినకవి కాకమానిమూర్తి. ఇతఁడు పెన్నానంశమునఁ బుట్టినవాఁడు. ఇతనితండ్రిపేరు రామలింగభట్టు. ఈతనికవిత్వము రసయుక్త మై వివిధశబ్దార్థాలంకారసహిత మై యుండు. ఇతని కనర్గళ మైనకవితాధార యున్నట్టు లీతనిరచియించినగ్రంథములం జదివినప్పుడు స్పష్టముగాఁ దెలియ వచ్చుచున్నది. ఇతని గ్రంథములందు లాక్షణికవిరుద్ధము లైనప్రయోగములు గొన్ని చూపట్టుటయే కాక యన్యదేశ్యపదములును విశేషించి ప్రయోగింపఁబడి యున్నవి. ఈకవి హూణశకము 1670 వ సంవత్సరప్రాంతములం దుండినట్లు దోఁచుచున్నది. ఇతఁడు రచియించినగ్రంథములు రాజవాహనవిజయము గాక పాంచాలీపరిణయమును, బహుళాశ్వచరిత్రమును,



క. కాంతలతాంతామోదా
క్రాంతానంతంబు పాంథ ♦ కాంతస్వాంతా
త్యంతాగ్నితాళవృంతము
శాంతహిమాశాంత మవ్వ ♦ సంతం బలరున్. 221

మ. అధికారంబులు పల్లవాలి కిడి బా ♦ ణాదిక్షమాజోద్ధతిన్
మధురత్వంబు ఘటించి గోపికలన ♦ స్నానంబు నిండించి తా
మధువున్ మున్ సుమనోనివాసమునకున్ ♦ మన్నించి శైలీముఖా
స్యధృతోద్గీతికఁ జిక్కె మాధవుఁడు రా ♦ ధాఖ్యాబలాసక్తుఁ డై. 222

క. మగధపతిఁ గాంచి వెలిమరుఁ
డగుదెంచె నటంచుఁ జైత్రుఁ ♦ డలరులమేల్క
ట్లిగురులతోరణములు దగ
నగ నగర మలంకరించె ♦ నా వన మొనరన్ 223

శా. పూచెం బొన్నలు గ్రొన్ననల్ మొనసె సొం♦పుల్ మీఱె సంపెంగి పె
ల్లేచెం బుష్పసమృద్ధి మల్లియలచా ♦ లిందిందిరీబృందముం
బ్రోచెం గుందము లందుగుల్ చిగురుగుం ♦ పుల్ నింపె నింపారఁగాఁ
గాచెన్ బాలరసాలసాలములు సిం ♦ గారంబుగా నామనిన్. 224

సీ. అంగనాగాత్రాది ♦ సాంగోపమానంబు, ననవిల్తుసానదే ♦ తీవలకోరి
స్తుతసంకుమదగంధ ♦ చూర్ణసౌరభదాత, రాచిల్కదొరయల్లె ♦ తాప్రిడు దెలియ
నధ్వగచేతోహు ♦ తాశనవ్యజనంబు, బుడుతతెమ్మెరయౌను ♦ రిడినదంట
రత్యంతతాంతహృ ♦ ద్రసపునస్త్రీతికర్త, చిఱుతుకఁ దల కెక్కుఁ ♦ జేయుదంట
తే. గర్వితారామభూమ్యలం ♦ కారకారి, చూడఁ గలవానిచెలికాని ♦ జోడుకోడె
శోభనస్వాంతనామధే ♦ యాభినవము, క్రొవ్వి యయ్యెడఁ గ్రొవ్విరి ♦ నివ్వటిల్లె. 225

## చంద్రాంగదచరిత్రము. ❁

### చతుర్థాశ్వాసము.

(నిషధాఖ్యపట్టణమునకు రా జైనయింద్రసేనుం డనురాజు విష్ణువనుగ్రహంబునఁ గమల యనుభార్యయందుఁ జంద్రాంగదుం డనుకొడుకుం బడసె.

225. ఇందుఁ గ్రొంబువ్వు పెక్కువిధంబుల వర్ణింపఁబడి యున్నది.

❁ చంద్రాంగదచరిత్రము రచియించినకవి పైడిమఱ్ఱి వేంకటపతి, ఇతనితండ్రి పర్వతాఖ్యుఁడు. ఇతఁడు హూణశకము 1700సంవత్సరప్రాంతములం దున్నట్లు గన్పట్టెడిని.

చంద్రాంగదుండును రూపంబున మన్మథుని మించి సకలవిద్యలం గఱచి ప్రాప్తయౌవనుం డై యొక్కనాఁడు వేఁట కరిగి యొకగోరువంకం దఱిమి కొని పోవుచు నెక్కడఁ దారాగణపరివృత యై యున్నరోహిణియుం బోలెఁ బెక్కండ్రురామామణులనడుమఁ జెన్నారు నెక్కచిన్నారికన్నియం గని విరాళిగొనియె. అన్నెలంతయు నతనిం గని తత్సౌందర్యవిశేషంబున కచ్చెరువడి తమిం జొక్కుచుఁ గొండొకకాలం బందు విహరించి యవ్వనినుండి వెడలి చనియె. అంత నగ్గోరువంక యా రాజకుమారుచేరువం జేరి చక్కనియింతి యై యాతని కిట్లనియె. నీవు గన్నయీచిన్నిబాల చిత్రసేననృపతికుమారిక. చంద్రశేఖరునిప్రసాదంబున జన్మించినయది. ఒక్కనాఁడు చిత్రసేనుఁడు తనసభలో నిసిద్ధాంత శాస్త్రిజ్ఞులవలనఁ దనకుమారిక పదివేలువత్సరములు జీవించు ననియుఁ బదునాల్గవయేఁటఁ బతిగండంబుఁ జెందు ననియు నెఱింగి యత్యంతచింతాక్రాంతుం డై యుండె. అంత నొకతఱి సత్యప్రతిజ్ఞుం డను విప్రుఁ డొకండు రాజుం గనుఁగొన వచ్చి తత్పుత్త్రిం గాంచి పదివేలువత్సరములు సౌభాగ్యగరిమం గాంచి మను మని దీవించె. చిత్రసేనుఁడు దైవజ్ఞులనిర్ణయంబు నాద్విజున కెఱింగింప నవ్విప్రుండును దనవచనంబు నిలిపికొన నెంచి దుర్గాదేవినిగుఱించి చిరంబుగఁ దపం బాచరించె. అద్దేవియుఁ బ్రసన్న యై చిత్రసేనుపుత్త్రికం జిరాయు వై బ్రదికెడు చంద్రాంగదున కిచ్చిన నీయభీష్టంబు సిద్ధించు ననియవ్విప్రున కెఱింగించి యతనియెదుర నే చిత్రరేఖ యను పేర నొప్పునన్నుఁ బిలిచి చిత్రసేన రాజుకుమారిక నెల్లేనిఁ జంద్రాంగదునకుఁ గూర్పు మని నుడివి యంతర్హిత యయ్యె. నేనును జిత్రసేనపార్థివుదేవిచెంతం జేరి నెచ్చెలి నై యుండఁ జిత్రసేనుదేవి నావ్రాయుచిత్తరువున కెంతయు సంతసించి నాకుమారికకుఁ దగినరాజకుమారుని భూమి నంతయుఁ బరికించి లిఖియించి తె మ్మని వేఁడికొన సమస్తరాజకుమారులం జూచినట్టుల వ్రాసి యిదిగో నిన్నును నిందు లిఖియించికొని పోవుచు నీవు వేఁటాడం గనుంగొని వనవిహారంబునకు వచ్చి యున్నయక్కన్నియ నీకుం జూప నిదియ సమయం బని యెంచి నీవు మృగయాసక్తుం డ వగుటం జేసి వేఁటాడం దగినజంతువ నైతి నేని నన్నుఁ

ఈతనికవిత్వము రసవంత మై పూర్వకవులరచనను బోలి నవీనవర్ణనంబులు పెక్కులు గలిగి ప్రౌఢమై యుండు.



దఱిమి కొని వత్తు వని భావించి శారికావేషధారిణి నై పాఱుచు, నట్లే నన్ను నీవు దఱిమికొని రా, ని న్నెలయించికొని వచ్చి యెట్టకేలకు నవ్వరారోహ చెంతకుం గొనిపోయి దానిని నీవు సూచున ట్లొనరించితి నని నుడివె. చంద్రాంగదుండు గోరువంక యై వచ్చినయాచిత్రరేఖచే నాచెలిం దనకుఁ గూర్ప నొప్పించుకొని తన పురంబున కేఁగి తత్తరుణీసక్తచిత్తుం డై మెలంగుచు వర్షాదిశిశిరాంతర్తువులు గడపె నంత.)

చ. దళ మగు నైంద్రసేనుతను ♦ తాపభరంబు సహింప లేమిచే
బలె శిశిరర్తు వేఁగఁ గను ♦ పట్టె వసంత మనంగకాంత మై
చెలువునఁ దన్నుఁ బోలునృపు ♦ చిత్తము డిందుపడంగ మిక్కిలిన్
వలపు ఘటించి తత్ప్రియ న ♦ వశ్యముఁ గూర్పఁ దలంచియో యనన్. 226

సీ. బళి పాండుపత్త్రౌఘ ♦ ములు నేలకుఁ దొరంగ, ఘనవనప్రియలీల ♦ కడు వెలుంగఁ
జాఁగురే వే మారు ♦ శరములు వికసింపఁ, గువలయం బొకవింత ♦ కొమరు నింప
బాపురే యెండ యే ♦ ర్పడ లోక మొఱ పొంద, వని సారసవనంబు ♦ పెసుపుఁ జెంద
నయ్యారె పథికసం ♦ హతి వడంకఁ దొడంగ, నిల తోఁపుఁబచ్చడం ♦ బులఁ జెలంగఁ
తే. గనదమితజాతివిస్ఫూర్తి ♦ గడకుఁ బాయఁ, బుడమిఁ గనుపట్టి మిగుల న ♦ ద్భుత మొనర్చెఁ
జారుతరమూర్తి సకలర్తు ♦ చక్రవర్తి, మధుఁడు దనయందు సకలర్తు ♦ మయత దోఁప.

మ. వనజాప్తుండు ప్రవృద్ధుఁ డై సముచిత ♦ వ్యాపారతన్ దక్షిణా
వనికిం బట్టముఁ గట్టి పట్టి హిమవ ♦ ద్వన్యాగ్రవీథిం దపం
బనవద్యస్థితి సల్పఁగా నరుగుచా ♦ యం బోయెఁ దా నుత్తరం
బునకుం జాపసనాథ వైఖరిఁ గర ♦ స్ఫూర్జజ్జటాపాళి యై. 228

సీ. జాతిసౌభాగ్యమా ♦ ర్జనహేమలేఖిను, లుదితాస్త్రమదనశీ ♦ ర్షోదయములు
సురభిపురస్స్ఫుర ♦ త్కరదీపికావళు, లలమధ్యకర్కరి ♦ కాననములు
గుజఘూంతభగ్నసం ♦ కులబాలరవిఘృణుల్, ద్రులతామిథోరాగ ♦ విలసనములు
పికసమాహ్వానక ♦ ల్పితమాంసఖండముల్, మారుతప్రాపిత ♦ మలయధాతు
తే. లమితవనదేవతాకేళి ♦ కాసమాన, చంద్రశాలావినిర్మాణ ♦ సముచితోత్థి
తప్రవాళమణిస్తంభ ♦ తతు లపార, కలనఁ బల్లవాంకూరముల్ ♦ గలయ మొలిచె.

229. ఇల్లై చిగురాకు పలుతెఱంగు లై నయొజ్జనివస్తువు లై యున్నట్లు 46వ, 115వ, 184 వ పద్యంబులందును వర్ణింపఁబడి యున్నది.

సీ. జాతివైభవసము ♦ చ్చాటనమంత్రంబు, గామప్రతాపాగ్ని ♦ సామిధేని
సౌరభాగమనూచి ♦ పాహెూనినాదంబు, శైశిరసమయాభి ♦ చారసూక్తి
తరులతాపరిణయో ♦ త్సవకాలశుభగీతి, బాలానిలాగ్రతగి ♦ పతితబిరుద
మనమానకిసలయ ♦ గ్రసనాన్నసూక్తంబు, పథికమనోంబుజ ♦ ప్రళయగర్జ
తే. ఘనవనీనరమానూతి ♦ కాన్థలాయ, మానసానాదిగంతరో ♦ ద్యానవాటి
ఘటితశుద్ధిపుణ్యాహసం ♦ కల్ప మొనఁగెఁ, గౌతుకాకుంతకలకంఠ ♦ కంఠరవము.

చ. శిశిరభగీరథాహృతవి ♦ సృత్వరశుభ్రహిమాభ్రవాహినీ
భృశతరవేగలీల సుర ♦ భిన్మరఘుస్మరుఁ డాఁగి నిల్చుచో
విశదముగా లతాజటల ♦ వెల్వడుతత్కణబృంద మో యనన్
దశదిశలం గుడుంగనము ♦ దాయములం దగెఁ గోరకచ్ఛటల్. 231

చ. తొడిమలచుట్టుఁ జుట్టుకొను ♦ తుమ్మెదలం గనుపట్టుమొగ్గపూఁ
దుడుములు గంటి కిం పెసఁగెఁ ♦ దొట్టినకిన్క మనంబులోపలం
గడుఁదమకంబు రేఁప బలు ♦ కాననపుంజెఱసాల సీతులే
బుడుతలఁ బట్టి మాధవుఁడు ♦ పూనిక సంకెల లూన్చెనో యనన్. 232

మ. తలిరుంగేలికి నీలకంకణము లై ♦ తళ్కుల్ పచారించుకు
ట్మలదంతావళికప్పుఁగ ప్పయి నిగా ♦ ధన్వచ్ఛగుచ్ఛస్తన
స్థలికిన్ మారకతోపలాగ్రసర మై ♦ చంచద్వనీదేవతా
లలనాసంతతికిన్ ఘటించెఁ గడుఁజె ♦ ల్వం బత్తఱిం దుమ్మెదల్. 233

మ. కలయం జొక్కపుముక్క చెక్కజిగిమొ ♦ క్కల్ నిక్క రాచిల్కపి
ల్కలు గుజ్జుంజిగురాకుమావిపొదలోఁ ♦ గా వేడెముల్ వెట్టి దృ
గ్జలజాతంబుల కింపుఁ గూరిచె భవి ♦ ష్యత్పొప్పపాలాసవ్రా
జ్జ్వలవర్ణాగమనూచిసౌరపరివే ♦ షశ్రీ విడంబించుచున్. 234

చ. హరునకు వెట్టఁ జుట్టినహి ♦ మాలయవాటికఁ జేరి యచ్చట
న్మరుఁడు తదీయశాసనము ♦ నన్ విరహిప్రకరంబు నొంప దు
ష్కరగతిఁ బెట్ట బో నొసఁగ ♦ గైకొని వచ్చినలీల వచ్చెఁ గ్రొ
వ్విరిరవదువ్వచాల్ గొని ది ♦ విన్ మలయాచలవాతపోతముల్. 235

మ. తలిరుంగేల మరుత్కిశోరగమితా ♦ త్యచ్ఛప్రసూనాంతరో
జ్జ్వలకింజల్కసమాఖ్యకోద్రవము లెం ♦ చ న్నించి లేఁదేఁటిపి
ల్కలపేరం దగుబొగ్గుజీనువలజో ♦ ళ్లం బట్టి యాడించె న
ర్తి లతాంతాయుధుఁ గూడి మాధవుఁడు జా ♦ తిస్యూతసూత్రచ్యుతిన్. 236



మ. అలరుంబుట్ట శిరోవిలగ్నమధుబిం ♦ ద్వాసక్తరేణుచ్ఛలా
కలితస్ఫారఫణామణీకమధులి ♦ ట్కాలాహి వే వెల్వడన్
నిలిపెన్ సంపఁగితావికొమ్మతగటీ ♦ నిద్దంపుబెత్తంపుఁ బ్రే
టులఁ దద్ధూళివిభూతిలిప్తుఁడయి గా ♦ డ్పుం జోగి యెంతే రహిన్. 237

మ. తలిరుంజొంపపుడాలు పూరజపుని ♦ ద్దాజాలు బత్తేఁటిగం
టలచాలున్ విరితేనె మేలు తరులం ♦ టం బ్రాఁకు లేఁదీవచే
రక్కలబారీలు జగాచొకాయలగుజా ♦ గామావటీ లొప్పఁగా
వలరాడంతులకై వడిన్ వనము ప్రో ♦ వన్ ద్రిమ్మరున్ దమ్మెరల్. 238

సీ. ఇగురుఁగై జీతంపు ♦ టెక్కటీలకు గుజ్జు, పఱపుమామిడి కట్టు ♦ బడిగఁ జేసి
చలువపూఁదేనెగా ♦ సపునల్లప్రజలకు, నలకుటీరమ్ము లి ♦ మ్ములుగఁ జేసి
పొలు పొందుపండుకా ♦ వలిపాళెగాండ్రకు, గున్నదాడిమ మిచ్చి ♦ కుదురుపఱిచి
వలితావియేర్పాటు ♦ వడిగలదొరకుఁ బు, ప్పొడిదిన్నె గము లేలు ♦ బడిగఁ జేసి
తే. తలిరువిలుకాఁడు కెరలి పోఁ ♦ జులుఘటించె, హత్తివిరహులమీఁదదం ♦ డెత్తఁదలఁచి
రతియుఁ దనప్రమోలఁ గడువడి ♦ రతులఁ దేలఁ, బంతమాడుచుఁ జాలవ ♦ సంతవేళ.

మ. తలిరుంగైదువురాయఁ డధ్వగులపై ♦ దండెత్తలేగాలిబె
స్తలచేఁ బంపినపండుటాకుఁదగటీ ♦ జాబుల్ గనుంగొంచు విం
తలుగా వారికిఁ జైత్రుఁ డిచ్చుబురుసా ♦ దట్టీలు ముత్యాలతా
వలము లొబ్బలెఁ దగున్ జిగుల్గఁ గలికా ♦ వారమ్ము లీరమ్ములన్. 240

సీ. సుమనోరథుఁడు ధాత్రి ♦ సుమనోరథుండయ్యె, శుకములు ప్రకటితాం ♦ శుకములయ్యె
మాకంద మలఘుర ♦ మాకందమై మించె, నకులంబు నవపల్ల ♦ వకుల మయ్యె
రోలంబ మగమశి ♦ రోలంబమై పొల్చె, జాతులు హతనిజ ♦ జాతులయ్యెఁ
గలకంఠ మను వేల ♦ కలకంఠమై యొప్పెఁ, బవనుఁడు సేవితో ♦ పవనుఁ డయ్యె
తే. మధురతరశీతమధుపూర ♦ మహితకుసుమ, పరిమళమ్ములు గమ్మని ♦ పరిమళించెఁ
దలిరులేఁదీఁగ యువిడకై ♦ దండయొసఁగెఁ, జెలఁగివనవీథిఁ జైత్రుం ♦ డు నిలుచునపుడు.

## * రుక్మిణీపరిణయము.

(కుండినపురం బేలుచుండినభీష్మకరాజునకు నేగురు పుత్త్రు లుద్భ
విల్లిరి, అనంతరము లక్ష్మీయంశంబున రుక్మిణి నాఁబరఁగునొకపుత్త్రి)

* రుక్మిణీ పరిణయ మియ్యది అభినవవాగనుశాసన, కవిసార్వభౌమ, బిరుదులనుఁ గాంచినకూచిమంచి తిమ్మకవిచే విరచితమయినది. ఈకవి యాఱువేల

కలిగెను. ఆనెలఁత క్రమంబుగా యౌవనముం బ్రాపించి సమస్త
సుగుణాలంకరిష్ణుం గృష్ణుం దనకుఁ బతిగాఁ గోరి యాతనిం బొందు
వెరవు గానక విరహవేదనచేఁ బరితపించుచుండ.)

క. అంత వసంత మనంతల
తాంతనితాంతాళిపికశు♦కాదిశకుంతా
క్రాంతవనాంతరమై జగ
మంతయు సంతసిల నలరె♦ నభినవలీలన్. 242

సీ. ఘనసారకేతకీ♦పనసారవిందాది, వనసారసౌరభ్య♦వాసితంబు
సురసాలతులితామి♦తరసాలఫలలోల, సరసాలపనశీల♦వరశుకంబు
సుమనోరసాస్వాద♦నమనోరథాత్యాళి, గమనోరరీకృత♦భ్రమరకంబు
సుకరావయవచారు♦పికరావహృతపాంథ, నికరావలేపాత్త♦నిశ్చలంబు
తే. మదనకదనక్రియార్హాత♦మప్రసూన, మంజరీమంజుమాధవీ♦కుంజపుంజ
సంజవనరంజితాఖండ♦కంజజాండ, మండలంబు వసంతాగ♦మంబు దనరె. 243

క. పెళపెళలాడెడుకారా
కులు జలజల దులిచి వింత♦కొమరు దలిర్పన్
మిలమిలలాడెడు కెంజివు
రులతోఁ బొలుపారె భూమి♦రుహనివహంబుల్. 244

---

నియోగిబ్రాహ్మణుఁడు, గోదావరీమండలమునందలిపీఠికాపురప్రాంతమున నున్న కందరాడ యాతనివాసస్థానము, ఈతఁడు సింహాచలమాహాత్మ్యము, సారంగధర చరిత్రము, రసికజనమనోభిరామము, సర్పపురమాహాత్మ్యము, శివలీలావిలాసము, రాజశేఖరవిలాసము లోనుగా ననేకమిశ్రకావ్యములను, నీలాసుందరీపరిణయము, రామాయణము మొద లగునచ్ఛాంధ్రకావ్యములను రచించి ఖ్యాతిఁ గాంచినవాఁడు. ఈతఁడు తనగ్రంథములను నరుల కంకితము సేయక తన కుపాస్యదైవం బగుకుక్కుటేశ్వరుని కంకితము చేసినవాఁడు. ఈతనికవిత్వము సరసమై శబ్దార్థాలంకారములచే నొప్పి సహృదయహృదయంగమంబై కొన్ని శృంగారరసప్రధానములుగాను, కొన్ని భక్తిరసబంధురములుగాను, నుండును. ఇందుఁ గొన్ని కవిత్రయమువారిప్రయోగములకు విరుద్ధముగా నున్నను మొత్తముమీఁద సలక్షణ మనియే చెప్పనొప్పు. ఈమహాకవి క్రీస్తుశకము 1715వ సంవత్సరము మొదలు 1756వ సంవత్సరమువఱకు జీవించి గ్రంథముల రచించినవాఁ డని తెలిసెడిని. ఇతఁడు మొదట రచించినది రుక్మిణీపరిణయము, చివరను రచించినది శివలీలావిలాస మని యూహింపఁదగియున్నది.



చ. సరసగతిం జిగిర్చనవి♦శాలరసాలలతావితానముల్
మెఱసె వసంతుఁ డాదరము ♦ మీఱ వనేందిరఁ బెండ్లియాటకున్
సురుచిరలీలఁ జేరు నను♦చున్ సమయాఖిలకార్యదక్షుఁ డ
త్తఱి నలరింపఁ జేయువిత♦తం బగుకెంజిగిమేలుకట్లనన్. 245

తే. గీ. దట్టముగఁ బూచి శాల్మలీ♦తరువు లమరె
విరహిణుల నేఁచ వాహ్యాళి ♦ వెడలఁ దలఁచి
యలరఁ జేసినధాతురా♦గారుణితము
లగుమనోజునిమదపుటే♦నుఁగు లనఁగ. 246

తే. గీ. వనరమామాధవోద్వాహ♦వైభవమున
సంపు దళుకొత్తఁ గ్రొత్తగా♦ నేర్చి యుడిన
మేలితెలిముత్తియపుసేసఁ♦బ్రా లనంగ
మొనసి యున్నట్టె జిగి మల్లె♦మొగ్గ లమరె. 247

క. నన లెత్తినకింశుకములు
దనరెన్ మాధవుఁడు వలపు ♦ దళుకొత్తంగా
వనలక్ష్మికిఁ గానిక లి
చ్చిననునుఁగెంజాయపట్టు♦చీర లనంగన్. 248

క. చిగురాకు మెక్కి మిక్కిలి
పొగరెక్కి రసాలసాల♦ములపైఁ బికముల్
తగ నిక్కి చొక్కి పాంథుల
కగణితముగ గుండె జల్లు♦ రన వడిఁ గూసెన్. 249

---

245. ఈపద్యమున వికసించినతియ్యమామిడిచెట్లు వసంతునికి నేర్పఱుపఁబడినమేలుకట్లుగా వర్ణింపఁబడియె.

246. ఈపద్యమున బూరుగులు మదనునిమదపుటేనుఁగులుగా వర్ణింపఁబడియె.

248. ఈపద్యమునఁ గింశుకములు వసంతుఁడు వనలక్ష్మి కిచ్చినయెఱ్ఱనిపట్టుచీరలుగాఁ జెప్పఁబడినవి. 48 వ పద్యమునఁ గింశుకకోరకము మదనుని బొడ్డుకోసినకొడవలిగాఁ జెప్పఁబడెను.

249. ఇందుఁ గోకిలలస్వభావము వర్ణింపఁబడియెను.

క. ఎక్కడఁ జూచిన శారిక, లెక్కడఁ జూచినఁ బికంబు ♦ లెడ మింతయు లే
కెక్కడఁ జూచినఁ దుమ్మెద, లెక్కడఁ జూచిన శుకంబు ♦ లిలఁ జెలరేఁగెన్.

సీ. సుందరశుకరాజ♦వందిబృందంబులు, కలకంఠవరకంఠ♦కాహళములు
వికచతిరీటప్ర♦విమలాతపత్రముల్, సహకారమంజరీ♦చామరములు
లాలితాశ్వత్థప♦ల్లవకేతనంబులు, మత్తషట్పదగాయ♦కోత్తములును
భవ్యప్రసవకుంజ♦పటకుటీరంబులు, సంఫుల్లచంపక♦స్వర్ణరథము

తే. లతులతరకేతకీదళో♦గ్రాయుధములు, నలర బలయుతుఁడై మనో♦జావనీశుఁ
డేపుతోఁబాంథవితతుల♦ నేఁచఁబూని, హర్షమిగురొత్తనపుడువా♦హ్యాళి వెడలె.

సీ. ప్రకటపాలాశకో♦రకనఖక్షతయును, గలరవాంచితరుత♦గళరవయును
సమదమిళిందని♦స్వానసీత్కారయు, నవనీపతత్పుష్ప♦హారమణియుఁ
గీరశారీరవ♦కింకిణీనినదయు, శుంభల్లతాపరి♦రంభణయును
బరభృతసందష్ట♦పల్లవాధరయును, గళదురుమకరంద♦ఘర్మకణయుఁ

తే. బరిమళానిలనిశ్వాస♦భాసురయును, వితతఘనసారచూర్ణభా♦వితయు నగుచు
నలరి వనలక్ష్మి మాధవు♦నతులగతులఁ, గూడి క్రీడించె వేడుక♦తోడ నపుడు.

వ. మఱియునుం జుఱుకు గలతురంగంబులం బఱపిన గౌరగోరం బరువు లిడుచాడ్పున ధరణీపరాగంబు నభంబున కెగయ విసవిస విసరుసుడిగాడ్పులును, గాడ్పులవలనం జలించుచు బెడిదంపుటంపగుంపుసొంపున బెం పలరి జలజల రాలు కారాకుతిండంబులును, గారాకుతండంబు లెల్ల డుల్లినపెల్లున మొల్లంబుగఁ గవచంబులు దొడిగి యుడుగనిచలంబునఁ గయ్యానకుఁ గాలుద్రవ్వుచు నిల్చినబిరుదురాహుత్తులపగిది నిగురుజొంపంబుల నలరుమహీరుహంబులును, మహీరుహాగ్రంబు లెక్కి వెక్కసంబుగఁ గెంజివురులు మెక్కి చొక్కి పోగరెక్కి నిక్కి చిక్కక యొక్కుమ్మడిం బరుల వెన్నాడి నిలునిలు పోకుపోకుమని తాఁకం గూఁకలిడు వీరభటులయటుల కో యని కూయుపికనికరంబులును, బికనికరంబులకుఁ దోడుగఁ గూడి ధీరు లగువజీరులబిరుదులు పొగడువందిబృందంబులచందంబున నందంబుగఁ బల్కుశుకంబులును, శుకముఖోపమానముకుళాభిరామంబు లై భీమంబుగ నెదిరి పిఱుతివియక కఱకుటడిదంబులు వెఱికి యుఱికి నఱకులాడి యచ్చంపుఁబచ్చిగాయంబులతో నలరుశూరులతీరునం

250. ఈవర్ణనమే గొంచెముభేదముతో 8వ 27 వపద్యములయందు వర్ణింపఁబడి యున్నది.



గెరుపలాశంబులును, బలాశభూతబేతాళనిచయంబులకుఁ బ్రియంబు లగుమాంసఖండంబులలాగునఁ బ్రోగులై రాలుశాల్మలీకుసుమంబులును, గుసుమరసపానోన్మాదంబున మోదంబున మీఁదికి నురవడి నెగయుచు మరునిమౌర్వీనాదంబుల విధంబున ఝుంకారంబులు సేయుమధుకరంబులును, మధుకరంబు లాస్వాదంబు లొనరించుతఱిం గ్రిందికిం జిందిరక్తప్రవాహంబులపోలికం జాలువాఱు పూఁదేనెటేఱులును, దేనెటేఱులయోరల మకరందధారలం బద నెక్కి మస్తిష్కపంకంబులపొంకంబున నొప్పుపుప్పొడికుప్పలును, మెఱుఁగుటరిగల గరిమ వెలుంగు గురివెందవిరిగుత్తులును, గేతనంబులరీతిఁ బొదలుచలదళపల్లవంబులును, వాఁడిబల్లెంబులపోఁడిమిం జెన్నగుకేతకీదళంబులును, దంతపంక్తుల లీలం గ్రాలుమల్లికాప్రసవంబులును, విమలాతపత్రమౌక్తికంబులభాతి డుల్లుశిరీషకుసుమంబులును, జామరంబులకైవడిం బడురసాలమంజరులును, నాసల మొడ్కుం దెగి జాఱుచంపకంబులును, మస్తకస్తోమంబులవడువున నెడ తెగక పుడమిం బడుకపిత్థఫలంబులును, మొండెంబులతెఱంగునం బొరలాడుపనసఫలంబులుం గల్గి ఘోరరణరంగంబు నధగమించుచు, వేఁటవాటియుంబోలె నపరిమితపల్లవసల్లలితంబై, త్రిదివంబునుంబోలె నమితసుమనోవిరాజితంబై, తూణీరంబునుంబోలె సాంద్రశిలీముఖోపేతంబై, వితరణినృపసభాభవనంబునుంబోలె ద్విజగణపరివృతంబై, సరోవరంబునుంబోలెఁ గువలయామోదకరంబునై యొప్పె నప్పుడు. 253

## * రాజశేఖరవిలాసము.

### ద్వితీయాశ్వాసము.

దేవర్షి యగునారదుండు భల్లాణభూవల్లభునివృత్తాంతం బుమాకాంతునకుం దెలుపఁబోవుచుఁ గైలాసంబు చూచి యందు నొక్కొక్కభాగంబున నొక్కొక్కఋతువు దప్పక యెప్పుడు నొప్పు మిగిలి యుండుటం గని వర్ణింపఁగడఁగి.

253. ఇందు శృంగారవీరరసంబులకలయిక వర్ణింపఁబడినది.

* రాజశేఖరవిలాసమునకు భల్లాణచరిత్రమని నామాంతరము, ఈగ్రంథము రచనాసౌష్ఠవము కలిగి వినువారివీనులకు విందొనరించుచుండును. ఇయ్యది కూచిమంచి తిమ్మకవి కృతము. ఇది 1౮వ శతాబ్దారంభమునఁ జేసి యుండునోపు. ఈభల్లాణరాజుచరిత్రమును అనేకులు అనేకవిధములుగా రచియించి యున్నారు.

చ. శకలితపత్త్రిమాల్ప్రకట ♦ జాలకచంచువులు న్వసింప నిం
చుక శుకనామ మబ్బుటనె ♦ సొంపున మాకు సమంబె? తారుకిం
శుకము లటంచు నెంతయును ♦ జూడఁగ నోర్వక తమ్ముఁ బల్కుచుక్
శుకములు పల్కె నండతుల ♦ శోభలఁ గేరుఁ బలాశజాలముల్. 254

చ. సకలసుమంబులం దుఱుము ♦ శంభున కెగ్గొనరించి వానిపూ
జకు వెలి యైనగేదఁగిని ♦ సమ్మతి నొందు నటంచు పుల్లచం
పకములు పూనికతోడ మధు ♦ పమ్ములఁ బాఱఁగఁ దోలుఁ జేరనీ
యక యటుగానిచో మధుక ♦ రావళి చేసిన దేమి వానికిన్. 255

తే. గీ. మెండుకొని గండుఁదుమ్మెద ♦ పిండు నిండి
యుండఁ గన్నులపండువై ♦ బొండుమల్లె
పొద లలరు నందు హారిరత్న ♦ ములు ఘటించి
నెఱి నిడినముత్తియంపుఁబం ♦ దిరు లనంగ. 256

చ. సురుచిరపల్లవప్రకట ♦ చూతలతాస్థితకోరకావళుల్
వరుసఁ జెలంగు మాధవుఁడు ♦ వావిరి నవ్వనలక్ష్మి కెంతయుక్
గుఱుతుగఁ బ్రేమతోడుతను ♦ గూర్చి యొసంగినశోణనీరజ
స్ఫురదసితోత్పలౌఘముల ♦ పొల్పగుమాలికలో యనం గడున్. 257

రగడ. మఱియుఁ జివురించునెల ♦ మావులను రావులను
బోరఁబోరని విలసిల్లు ♦ పూవులను దావులను
సోలయుచును జారుతర ♦ సూనముల లీనములఁ
దలరునిందిందిరవి ♦ తానముల గానముల
సారూఢఫలరసా ♦ హారముల బీరములఁ
గేరి పొలుపారుమద ♦ కీరముల వారములఁ
బగలురేలు లతాగ్ర ♦ భాగముల భోగములఁ
బాగ రెక్క కూయుపిక ♦ పూగముల రాగముల
మాటికిని జొదరిండ్ల ♦ మాటులను నీటులను
గూటముల బెనఁగుసుర ♦ కోటులకు బోటులకు
దానకము లైనమం ♦ దారముల తీరముల
మాసైనపుప్పొడిడు ♦ మారముల పూరముల
మరగి విద్యాధరకు ♦ మారికల చేరికల
సరసగతి నలరారు ♦ శారికల కోరికల
విరివి మీఱఁగ నెపుడు ♦ వేదముల నాదముల
మొరయుమునిజనులస ♦ మ్మోదముల వాదముల
నయ మొప్పసంతతా ♦ నందముల డెందములఁ
బ్రియలీలఁ దగువధూ ♦ బృందముల చందముల
బలమైనపూఁదేనె ♦ వానలను గోనలను
జెలఁగి తడియునిలింప ♦ సేనలను జానలను
దఱుచైనఘనసార ♦ తరువులను బోరువులను
దిరమైనవలచదురు ♦ తెరువులను విరువులను
నెఱిఁ బూచుసంపెంగ ♦ నీడలను వాడలను
సరవిఁ దిరిగెడుచెలుల ♦ జాడలను గ్రీడలను
దొలఁగకతిమందవా ♦ తూలముల లోలముల
నలరి యాడెడుమహా ♦ వ్యాళముల జాలములఁ
దొడరి మార్గము లెల్లఁ ♦ దుండముల కాండములఁ
దడిపి విలసిల్లువే ♦ దండముల తండములఁ
బరఁగు గిరిచెంగటను ♦ బాత్రమున గోత్రమున
మరలక వసంత మతి ♦ మాత్రమున సూత్రమున. 258



## * రసికజనమనోభిరామము

### ద్వితీయాశ్వాసము.

(బ్రహ్మనారదసంవాదాత్మకం బగు నీగ్రంథంబున బ్రహ్మ నారదున కిట్లనియె. ఈభూమండలంబునఁ గల్యాణ మని యొకపుటభేదనము కలదు. దాని ఋతుధ్వజుం డనురా జేలుచుండి యొకనాఁ డరణ్యమునకుం జని వేఁటాడుచుండ.)

---

258. ఇట్లే 118వ రగడయందుఁ గొనియాడఁబడి యున్నది.

* రసికజనమనోభిరామము. ఇదియును రాజశేఖరవిలాసమువలెఁ గూచిమంచి తిమ్మకవికృతము. ఇయ్యది శబ్దార్థాలంకారశోభితమై యలరారుచున్నది. ఈగ్రంథము 18 వశతాబ్దమున విరచింపఁబడినది.

ల. అంతట వసంత మసు•రాంతకతనూభవదు•రంతనిశితప్రసవ•కుంతహృతపాంథ
స్వాంతము శుకీపికశ • కుంతకలనిస్వనని • రంతరసమాకులది•గంత మసకృన్ని
ష్క్రాంతమధుపానమద•దంతురితషట్చరణ•సంతతివిసృత్వరల•తాంతమువనాంతా
క్రాంతరతికాంతరణ•తాంతలలనాజనని•తాంతసుఖదానిలని•శాంతముదనర్చెన్.

క. శుకపికశారీమధులి
ట్ప్రికరమహానినదనిబిడ • బధిరీకృతస
ర్వకకుప్పతికర్ణం బై
యకలంకగతిన్ ధరిత్రి • నామని యొప్పెన్. 260

తే.గీ. జీర్ణపర్ణంబు లూడ్చి కెం • జిగురుటాకు
జొంపములతోడఁ దరువులు • సొం పెసఁగ వ
సంతురాక దలఁచి వని • కాంత మెఱుఁగుఁ
దొడవు లెడలించి మణిభూష • లిడె ననంగ. 261

క. కుసుమితశాల్మలు లపు డిం
పెసఁగె న్విరహిణుల గెలువ • నేఁగుచు నెలమిన్
బిసరుహశరుఁ డంపించిన
పసఁ బొసఁగెడుతమ్మికెంపుఁ • బని తేరు లనన్. 262

సీ. శుకరాజమాగధ•ప్రకరముల్ గీర్తింపఁ, గలకంఠకంఠకా•హళులు మొరయఁ
బరిఫుల్లకింశుక•కరదీపికలు గ్రాల, సాంద్రపరాగర•జమ్ము గ్రమ్మ
సహకారపల్లవాం•చత్కేతువులు మీఱ, సమదరోలంబసై•న్యములు గొలువఁ
గేతకీగర్భద•శాతతాస్త్రిము లొప్పఁ, బృథుమరున్నినదభే•రికలు సెలఁగఁ
తే. బ్రసవచంపకరథకదం•బములు మెఱయ, దర్పకునితోడఁ గూడి చై•త్రప్రభుండు
విరహిణీపాంథసందోహ•విజయమునకు, హోళి దైవాఱ నపుడువా•హ్యాళి వెడలె.

---

259. 116వ పద్యమునందలివర్ణన నీవర్ణనతోఁ బోల్చిచూచుకొనునది.

261. రాలినపండుటాకు లీపద్యమున వనలక్ష్మియొక్క మెఱుఁగుఁదొడవులుగా వర్ణింపఁబడియె. 96వపద్యమున ఆరామలక్ష్మి యిడినరత్నరంగవల్లులుగాఁ జెప్పఁబడియున్నవి.

262. ఇందు వికసించినశాల్మలీవృక్షములు మన్మథునికెంపు తేరులుగా నుత్ప్రేక్షింపఁబడినవి. 248వ పద్యమున మదనునియేనుఁగులుగా వర్ణింపఁబడినవి.

263. 251 వ పద్యమునఁ గొంతభేదముతో నిట్లే వర్ణింపఁబడియున్నది.

263. ఈపద్యమునఁ జైత్రుఁడు వాహ్యాళి వెడలినట్లు వర్ణింపఁబడియున్నది



మ. బలవద్దర్పకవీరకాహళరవ•ప్రాయంబు లై మించి సొం
పలరం బాంథనితంబినీజనఘన•స్వాంతంబు లెంతేనియుం
గలఁచె న్బాలరసాలపల్లవలవ•గ్రాసావలేపోల్లస
త్కలకంఠప్రమదానిరంతరకుహూ•కారంబు లప్పట్టునన్. 264

క. మహిళాపున్నాగంబు
ల్మహిఁ గుసుమకదంబలీలఁ • గ్రాలఁగ నచ్చో
మహిళాపున్నాగంబు
ల్మహిఁ గుసుమకదంబలీల•లం గ్రాలెఁ గడున్. 265

తే. పవనదుశ్శాసనుఁ డవని• పాండవేయ
లలనజీర్ణచ్ఛదాంశుకం•బులు హరింపఁ
గలికి శుకసూక్తిఁ జీరఁ గి•సలయహేమ
మయపటము లీఁడె యయ్యెడ • మాధవుండు. 266

శుకముఖద్విజమండ•లికి మహాఫలదుఁ డై, తవిలి వేమఱు మరు•త్తతి భజింపఁ
గ్రూరపలాశసం•హార మొనర్చుచు, సరససుపర్ణలాం•ఛనము మెఱయ
నాశ్రితాళులు నితాం•తామోదమునఁ గ్రాలఁ, జెలఁగి వనప్రియ•శ్రేణి వొగడ
ఘనతరుల్ సుమనోవి•కాసలీల నెసంగఁ, గలితశుభశ్రీప్ర•కర్ష మొలయ
తే. సమధికపరాగవహనప్ర•శస్తి యలర, వనజసాయకగురువై భ•వంబు నెఱపి
భవ్యవనమాలికాసము•ద్భాసి యగుచు, మహిమఁ జెన్నొందె నవ్వేళ•మాధవుండు.

క. వనరమకున్ మాధవునకుఁ
దనరఁగఁ బరిణయ మొనర్పఁ • దటి యనుజవరా
లునిచినముత్తెపుఁబ్రాలన
మొనసి వనిం గ్రొత్తమల్లె•మొగ్గలు దనరెన్. 268

క. రాగము చిగురాకున కను
రాగము బొజుఁగులకు ఘనప•రాగము వనికిన్
రాగము మధుకరములకు స
రాగము గృహులకును గల్గె•రహి నవ్వేళన్. 269

సీ. శుకనాదములు ద్విజ•శ్రుతిఘోషములుగాఁగఁ, గనకకోరకము ల•క్షతలుగాఁగఁ
దేఁటిపాటలు పురం•ధ్రీగీతములు గాఁగఁ, గిసలముల్ దోరణ•విసరములుగ
బలుఁగప్పురంపుఁది•న్నెలు వితర్దులుగాఁగఁ, బుప్పొడుల్ వలిగంద•పొడులు గాఁగఁ

దెలిమొల్లమొగ్గ చాల్పులు తలఁబ్రాల్ గాఁగ, విరితీవపొదలు పందిరులు గాఁగ
తే. పుష్పితపలాశనికురుంబములు నివాళి, పల్లెములు గాఁగ నిర్ఝరపవనచలిత
తరురవంబులు భద్రవాద్యములు గాఁగ, వనవధూమణిఁ జైత్రుఁ డుద్వాహ మయ్యె.
సీ. పల్లవశ్రేణి కంబ్రంపురాఁగ మెసంగె, హితఫలంబులు ద్విజప్రతతి కొదవ
సుమనోవికాస మచ్చుగ భూజనులకబ్బెఁ, జాగెఁ బల్మఱు మరుత్సంభవములు
చండాలులకుఁ బొల్పెఁ సఁగె మధుపానాప్తి, యమితరసాలకాండములు మెసెఁ
బ్రసవధర్మక్రియాపరత నొప్పిరి గృహుల్, ప్రబలె నర్చులు చిత్రభానునందుఁ
తే. గుంభినీవల్లభులకు మిక్కుటపు దాన, గుణము వాటిల్లెఁ ద్రిభువనప్రణుతనిఖిల 271
జంతుసంతానహృదయరంజకమనోజ్ఞ, లీల నలరు వసంతర్తు వేళయందు.

## * వాసవదత్తాపరిణయము.

### ద్వితీయాశ్వాసము.

(కుసుమపురంబు నాఁ బుటభేదనం బొండు విలసిల్లుచుండు. శృంగారశేఖరుం డని వినుతి కెక్కినయొక సార్వభౌముండు దానిం బాలించుచుండెను. అపుడమిఱేని కనంగవతి యనుతనధర్మదారయందు వాసవదత్త యని యొకకూఁతురు జనియించె. ఆకన్య క్రమక్రమంబుగా యౌవనముం బ్రాపించి యుద్యానవనము చేరం జనునప్పుడు.)

శా. కాంతంబై సుమనోమనోజ్ఞనవమాకందద్రుకాంతారసం
క్రాంతానంతమనోజసైనికపటాగారావళీభూతకుం
జాంతస్స్వంతతపల్లవోదయదిదృక్షానందితస్వైరిణీ
స్వాంతంబై తనరెన్ వసంతము లతాంతాలంకృతానంతమై. 272

---

271. ఇందుఁ జండాలభృంగములకుఁ జండాలు లనునది శ్లిష్టవాచకము, మాలలనునర్థమందుఁ జండాలురు అని రూపము సిద్ధించు.

* వాసవదత్తాపరిణయము వక్కలంక వీరభద్రకవికృతము, ఈకవి దెందులూరి లింగనారాధ్యునిశిష్యుఁడు. కూచిమంచి తిమ్మకవికి సమకాలికుఁడు. కవితారచన మిగుల మృదువై ద్రాక్షాపాకశోభితమై కొన్నియెడల శ్లేషలచేతను గొన్నియెడల యమకాదిశబ్దాలంకారములచేతను నొప్పి యుండు. దీనిని సంస్కృతమున సుబంధు వనుకవిచంద్రుఁడు గద్యకావ్యముగాఁ జేసెను. అది ప్రతిపదశ్లేషచే నలరుచుండు. ఇయ్యది 18 వ శతాబ్దమధ్యమున రచింపఁబడినది.



సీ. ప్రబలకుంజవ్రజపటమందిరము లొప్ప, సుమనోరజోవితానములు మెఱయ
మలయసమీరడింభకు లూడిగము సేయ, నవ్యకాంచనభూషణములు వెలుఁగఁ
బరభృతమాగధప్రతతులు గొనియాడ, లతికాంగనల నాట్యగతులు సెలఁగఁ
దతభృంగగాయకప్రతతి [illegible]ము సేయ, శుకశారికాదిసైనికులు గొలువ
తే. వనధరాస్థానమున మాధవప్రభుండు, నిగ్రహానుగ్రహక్రియానిపుణుఁ డగుచు
మధుపమాలిన్యజాతుల మద మడంచి, యధికతరులకుఁ బచ్చడాలపుడు గప్పె.

సీ. సహకారసురపదృక్చ్ఛలకనీనికలు వా, సంతికాలోచనచలవిసృమర
కజ్జలప్రభలనంగజ్వాలజ్వాలనధ్వ, జములు కుంజాకరస్థగితశక్ర
మణులు జాంబవసుమమావిగ్రహంబులు, చైత్రభాగ్యవిహీనజాత్యకీర్తి
లాలోలవనసరోనీలోత్పలదళంబు, లరుణప్రసూనగుంజాగ్రరుచులు
తే. కనకకోరకదీపశిఖాకలాభి, హతిసముద్భూతఝుంక్రియాకార్తనాద
సంచరిష్ణుకృశధ్వాంతశాబకములు, సెలఁగె షట్పదములు వనస్థలులయందు.

తే. విరహితతిమీఁద దండెత్తుమగని విజయ
శంఖములు పట్టి పూరించుజాడ దోఁప
నలరె మధుపము లపుడు ప్రత్యగ్రవిచిక
లాగ్రములమీఁద మధురసం బాన నిలిచి. 275

క. బత్తి గలమగఁడు చైత్రుం
డత్తటి వన్యావధూకచాంతరసీమన్
హత్తుకొనఁ జల్లి కూర్చిన
ముత్తెము లన సిందువారములు గనుపట్టెన్. 276

---

273. ఈపద్యమునందు మాధవుని ప్రభువుగాఁ జెప్పినాఁడు, 251 వ మున మన్మథుని ప్రభువుగాఁ జెప్పినాఁడు, ఈవర్ణనమునకు నచ్చటివర్ణనకు ఁ జూచుకొనునది.

274. ఇందుఁ దుమ్మెద లనేకప్రదేశంబుల ననేకవిధంబుల నున్నట్లు వర్ణింపఁబడుటచే నుల్లేఖాలంకారము.

276. ఈపద్యమున సిందువారములు ముత్తెములుగా నూహింపఁబడినవి. 268-వ పద్యమున మల్లెలు తఱి యనుజవ్వనియునిచినముత్తెంపుఁ బ్రాలుగా నుత్ప్రేక్షింపఁబడినవి.

చ. అసమశరప్రతాపదహ•నార్చిరుదంచితకీలలో యనం
గిసలయము ల్సెలంగ మరు•కీర్తులకై వడి వానిమీఁదటం
బ్రసవము లొప్ప మారునిప్ర•భావముకై వడి నున్నతప్రభా
విసరము చెంగలింప వన•వీథులఁ జూతము లొప్పె నయ్యెడన్. 277

క. మావులు గొన్ని మనోజుని
మావు లనం దనరెఁ బత్త్రి•మానితగుచ్ఛిచేఁ
గ్రోవులు మదనునికపురపుఁ
గ్రోవు లన న్వాలపుఁ దెలిపెఁ•గుసుమప్రభలన్. 278

## * యాదవ రాఘవ పాండవీయము.

ద్వితీయాశ్వాసము.

(పుడమియందు మథుర యయోధ్య నాగపుర మను పేరులచేఁ ప్రసిద్ధి కెక్కినపురత్రయంబు విలసిల్లు. దాని న్వరుసను శూరసేనుఁడు దశరథుఁడు ధృతరాష్ట్రుఁడు అను నామంబులచే నొప్పుమువ్వురు రాజులు పాలించుచుందురు, వీరికిఁ గొంత కాలము సంతానములేక పిమ్మటఁ బుత్త్రులుద్భవిల్లి వృద్ధిపొందునవసరమున.)

శా. అంతన్ భ్రాంతవనాంతరాంతరకృతాం•తాశాంతవాతాంకురా
హంతాక్రాంతనితాంతతాంతమృదువృం•తానంతసంతానశా
ఖాంతర్దంతురకాంతపల్లవలతాం•తాలోకచింతాకన
త్కాంతాస్వాంతము వింతవింతగ వసం•తం బెంతయు న్బొల్చినన్. 279

సురసాలతరుజాల•సురసాలవరలోల, సరసాలపనబాల•హారివిశాల
మలసానిలశతాంగ•దళసాకులలవంగ, ఫలసారసుమచంగ•వాసనాంగ

* యాదవరాఘవపాండవీయము:—ఈత్ర్యర్థికావ్యము నెల్లూరి వీరరాఘవకవిచే విరచింపఁబడినది. కాశ్యపసగోత్రుఁడు, ఆపస్తంబసూత్రుఁడు, వేంకటకవిపుత్త్రుఁడు. ఇయ్యది కృష్ణరామపాండవులయొక్క అర్థమువచ్చునట్లుగా వ్రాయఁబడియున్నది ఈకవియింటిపేరు తొలుత దేశరాజువారు నెల్లూరనుండినందున నెల్లూరివారని మాఱినది. ఈకవికవిత్వము అర్థత్రయము కలదగుటచే శైలి మొదలగువానిం దెలుపుట కష్టము, ఈకవి క్రీస్తుశకము 1715 సంవత్సరములప్రాంతమున నున్నవాఁడు.



మతిమత్తసారంగ•రుతిదత్తభయభంగ, వితతోత్తమాపాంగ•వృత్తిసంగ
ముదితపంచమనాద•గదితకోకిలవాద, విదితపాంథవినోద•విదితమోద
తే. మమలకాసారసారస•హంసఖగగ, రుత్పుటపటత్కార•రోపచార
రవపటహమారజైత్రయా•త్రావిలాస, భాసురము పొల్చె•మధుమాసవాసరాళి.

## ※ తారాశశాంకవిజయము.

ద్వితీయాశ్వాసము.

(పంకజగర్భవంశంబున నత్త్రి కనసూయయందుఁ జంద్రుండు పుట్టి వర్ధిల్లి యుపనీతుండై యుండునంత నత్త్రియొద్దకు బ్రహ్మ విచ్చేసి యతనిసుతుండగుచంద్రునకు గాండివం బను విల్లును, నక్షయతూణయుగ్మంబును, నొకదివ్యరథంబును, గలువసరం బొండును, నొసంగి విశ్వకర్మతోఁ జంద్రునికై యొకదివ్యపట్టణంబు నిర్మింపు మని చెప్పి మఱి చనియె. అంత విశ్వకర్మయుఁ బ్రతిష్ఠానాఖ్యచే నొప్పుప్రయాగంబు నిర్మింప నందు నివసించి యత్త్రి తనపుత్త్రు విద్యాభ్యాసంబు సేయ దేవగురువుకుఱఁగటి కనిపె. చంద్రుండును బృహస్పతికడ కేఁగి యాతనితోడ సకలవిద్యల నభ్యసించుచుండె. అట్టియెడ నాచంద్రునిరూపరేఖలం గాంచి తార విరాలి గొనుచు వర్తిల్లె.)

ఉ. అంత లతాంతకుంజసద•నాంతవిహారవిలాసవత్యుప
క్రాంతవసంతరాగవిస•రద్విగుణీకృతపల్లవోల్లస
త్కాంతిసదారుణోదయత•తప్రమదాకులకోకకామినీ
సంతతరుచ్యుదంతము వ•సంతము దోఁచె వనాంతరంబులన్. 281

280. ఈపద్యమందు వాసరాళికి విశేషణమయినభాసురశబ్దము మహతీతర విశేషణము కావున వైకల్పికముగాఁ గ్లీబత్వమునొందెను.

* తారాశశాంకవిజయము శేషము కృష్ణార్యునిపుత్త్రుఁడైనవేంకటపతి యనుకవిచే రచింపఁబడినది. ఇతఁడు నియోగిబ్రాహ్మణుఁడు. కందాళరామానుజాచార్యునిశిష్యుఁడు. వ్యాకరణవిరుద్ధము లైనప్రయోగములు కొన్ని యున్నను నితనికవిత్వంబు ద్రాక్షాపాకప్రాయమై యత్యంతశ్రావ్యమై శృంగారరసభూయిష్ఠమై వర్తిల్లు. ఇతఁడు హూణశకము. 1704 సంవత్సరమునకును 1731వ సంవత్సరమునకును నడుమ నుండినవాఁడు అనిప్రసిద్ధి.

క. ఆకులపాటు వియోగుల
కే కాదు ప్రపంచధర్మ ♦ మెఱుఁగ నివ్వృక్షా
నీకంబునకును గలిగెన్
డాక వసంతుని దె మిక్కు ♦ టంబుగ ధాత్రిన్. 282

ఉ. వాలుగ డాలువానిదళ ♦ వాయి వసంతుఁడు చైత్రయాత్రకై
సాలములందు జీర్ణదళ ♦ సంఘము చీలికఁ బెట్టి క్రొత్తగా
మేలిదళంబుల న్నిలిపి ♦ మీఱి యయుక్తజనామితక్షమా
పాళి గ్రహించి నూత్న మగు ♦ పైకములన్ సవరించె నెల్లెడన్. 283

క. ఎలమావిని నునుఁబల్కులు
గలకోయిలఁ జేరకుండఁ ♦ గాకము దఱిమెన్
లలితుఁ డగు నృపుని చెంగట
ఖలుఁ డొక్కరుఁ డుండి కవులఁ ♦ గదిమెడిమాడ్కిన్. 284

మ. తెలిమొగ్గల్ బలుసిబ్బెపుంబొడలు గాఁ ♦ దేనెల్ మదోద్వేలధా
రలు గాఁ దేఁటులబారు బారిగొలు సై ♦ రాణింప లేగుజ్జుపొ
న్నలు పున్నాగము లై వనిం జిగురుఖా ♦ నా తేజికిన్ మెచ్చుగా
దళశృంగారము లై చెలంగె నిరుచెం ♦ తన్ మావు లొప్పారఁగన్. 285

తే. సరజసారుణమకరంద ♦ సారధార
గుఱిసె నప్పుడు కుసుమమం ♦ జరిని జాలఁ
గమ్మవిలుకాఁడు విరహులఁ ♦ గ్రుమ్మి తివియఁ
గిరుసుకత్తిని దొరఁగు నె ♦ త్తురు లనంగ. 286

ఉ. కోయిలపేరిగారడపు ♦ గొంటరి తా ఋతురాజుముందటన్
మాయ వహించి లేఁజిగురు ♦ మారునికత్తులు మ్రింగ వాఁడు ము
క్తాయతహారపంక్తులు ప్రి ♦ యమ్ముగ నియ్యఁగఁ దెచ్చి నించె నా
నేయెడ మొగ్గచాలు జని ♦ యించెను భృంగకులంబు మెచ్చఁగన్. 287

---

285. ఇందుఁ బున్నాగములు మన్మథున కేనుంగు లై యున్నట్లు వర్ణింపఁబడియె.

287, 288. ఈపద్యంబులందలివర్ణనంబులు నవీనకల్పితంబు లై యున్నవి.



సీ. అమరం గ్రొవ్విరితీవెచాలుకొణతా ♦ లందంద లాగించి పొం
కము నాఫుప్పొడిమట్టిలోఁ బొరలి వీఁ ♦ కం బోఁకపూమొగ్గగో
తములన్ ద్రొబ్బి సమీరమల్లుఁ డను వొం ♦ దన్ మావిపూలోడిఁ ద్రి
ప్పు మెయిం గోకిలబాలుఁ డెంచికొను సొం ♦ పుల్ గుల్కు నాదంబులన్. 288
ఏలాలతాజాల ♦ డోలాసమాలోల, బాలామణీగాన ♦ భాసురములు
ధీరానిలవ్రాత ♦ ధారాచలచ్చ్యూత, దూరాపతద్రజో ♦ ధూసరములు
మోదావహానంగ ♦ వేదాభరవభృంగ, ఖేదావహాజ్ఞాత ♦ కేసరములు
నాళీకదృక్కాంత ♦ పాళీనవైకాంత, కేళీపరిస్ఫ్యూత ♦ కేసరములు
కనఁ దగె నకుంఠకలకంఠ ♦ కంఠనాద, పటుభటాహ్వానకుపితవి ♦ భ్యత్ప్రపంచ
పంచసాయకమదహస్తి ♦ పైసరములు, మీసరమ్ములు మధుమాస ♦ వాసరములు. 289
ఆమని యేమని చెప్పెద
నామనికిన్ వికచకుసుమి ♦ తారామతరుల్
నిరంతరకీర్తి
ముగా నిఖిలదిశల ♦ సొబ గొందు నెడన్. 290

*మిత్రవిందాపరిణయము.

ద్వితీయాశ్వాసము.

(భూమండలమున నవంతి యను నొకపుటభేదనము విలసిల్లు, దాని జయసేనుం డనురాజు పాలించుచుండెను. ఆపుడమిఱేనికిం దన ధర్మపత్నియందు విందానువిందు లనుకుమారులు గలిగిరి, అంత నారాజు స్త్రీప్రజంగోరి వేంకటాచలంబున నత్యుగ్రతపం బాచరించి మిత్రవింద యనుకుమారిం గాంచెను, అంత నాకన్యయౌవనసమయమున వివాహము సేయుటకుఁ బ్రయత్నింప)

మ. వసుధం దోఁచె వసంతకాల మళినీ ♦ వాచాల ముజ్జృంభిత
ప్రసవోద్వేల ముదారపైకవిగళ ♦ ద్వాగ్జాల ముద్యల్లతా

---

* మిత్రవిందాపరిణయము కుందుర్తి వేంకటాచలకవిప్రణీతము, ఈతని గ్రంథమునందు లక్షణవిరుద్ధము లగుప్రయోగములు పెక్కులుండుటచే నీకవి లాక్షణికుఁడు కాకపోయినను కవిత్వము నవీనకల్పనలచే నలరుచున్నది. ఈకవి క్రీస్తుశకము 1720 మొదలు 1740 సంవత్సరముల ప్రాంతముననున్నవాఁడు.

బిసబాహానటనానుకూలము మరుద్వీచీసముత్తాల ము
ల్లసితాపారపరాగసౌరభవిశాలం బుజ్జ్వలత్స్నాల మై. 29

సీ. అలకలకంఠద్విజాళిఁ బిల్వ మధుండు, సవరించుశోభనాక్షత లనంగ
మకరందవర్షసంపన్నిదానంబులై, పద్మినయింద్రగోపమ్ము లనఁగ
వనరమాసతి ఋతుప్రభుఁ జెందఁ గైసేయఁ, జూపట్టురతన పుసొమ్ము లనఁ
విజయంబు గైకొన వెడలుమారునిమ్రోల, నడరుచెంగావిపావడ లనంగఁ
తే. గోరిపున్నాగములను బైకొనఁదలంచు, నట్టిలతకూనలమనోగతానురాగ
రసతరంగంబులనఁ గుంజరాజిజలద, వళితశంపలు నాఁ బల్లవములిగిర్చె.

సీ. కుంజఘనాఘనక్రోడగళత్కోర, కనికాయపటుకరకానికరము
తరుసుమాగ్రవనీపతన్మధూళితవర్ష, కలితకౌసుమరజఃకర్దమంబు
అరుణకిసాలశంపాలోకననికృత్త, విరహిణీచిత్తదర్వీకరంబు
నానాప్రసవమాలికానగారిశరాస, రటదళీరణమయూరస్వరంబు
తే. కోకిలకుహూగ్రవజ్రనిర్ఘోషదళిత, మాలతీస్వచ్ఛతరుగుచ్ఛమత్తక
కంబయి సెలంగె వర్షర్తుకరణి ఋతుల, మీసరంబగువాసంత న-

యమరుత్తు తేరుగన మందమదోద్ధురగంధసింధురా
ళులుగఁ గేకిసంఘము లభంగకలస్వనకీర శారికా
కలరవముల్ భటాళులుగఁ గంకుఁడు వెల్వడేఁ బూవువింటను
జ్జ్వలతరపుష్పబాణములఁ బాంథులపై నిగిడించుచున్వడిన్.

## * సూర్యతనయాపరిణయము.

### ద్వితీయాశ్వాసము.

(ద్వారవతీపురియందుఁ గృష్ణుఁడు కొలువుతీఱియుండ నాసభకు
దేవమునియగు నారదుండొకనాఁడేతెంచి తాఁదెచ్చిన యొక చిత్ర

* సూర్యతనయా పరిణయము తక్కెళ్లపాటి వంశోద్భవుండగు లింగనార్యునిచే విరచితమయినది. ఈకవి నియోగిబ్రాహ్మణుఁడు హారితసగోత్రుఁడు ఆపస్తంబ సూత్రుఁడు ఇతఁడు మదనమోహినీ విలాసములోనగు పెక్కుగ్రంథములను రచించినవాఁడు, ఈతని కవిత్వము రసవంతమయి ప్రౌఢమయినదికాదు. ఇతఁడు క్రీస్తుశకము 1780 సంవత్సరముల ప్రాంతములనున్నవాఁడు.

